




# వేదములు

## విచారణ

### సాయణాచార్య భాష్యమునకు తెలుగు అనువాదము





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. మహానుభావులైన సాధకులు, జిజ్ఞాసువులు జ్ఞాన ప్రచారార్ధం తాము సేకరించిన విలువైన గ్రంధాలను **ఆర్కైవ్** వెబ్ సైట్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ సైట్(https://archive.org), గూగుల్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ఆర్కైవ్** వారి వెబ్ సైట్: https://archive.org/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు*

## ఆర్కైవ్ వారి వెబ్ సైట్:

## https://archive.org/

Internet Archive: Digital Li ×

https://archive.org

INTERNET ARCHIVE

Web Video Texts Audio Software About Account TVNews OpenLibrary

Universal access to all knowledge

Donate | Store | Blog | FAQ | Jobs | Volunteer Positions

Search: All Media Types Advanced Search Hello Komireddy (not you? sign in or log out) Upload

**Announcements** (more)

Millions of historic images posted to Flickr

Zoia Horn, librarian and activist, dies

Working to Stop Rewriting Copyright Laws via TPP Treaty

**Web** 426 billion pages saved over time

INTERNET ARCHIVE WayBackMachine http:// BROWSE HISTORY

**Welcome to the Archive** RSS

The Internet Archive, a 501(c)(3) non-profit, is building a digital library of Internet sites and other cultural artifacts in digital form. Like a paper library, we provide free access to researchers, historians, scholars, the print disabled, and the general public.

**Video** 1,721,625 movies — Browse (by keyword)

Curator's Choice (more)

Noveltoon: The Stupidstitious Cat

A very superstitious cat tries to catch Buzzy for breakfast but Buzzy outsmarts him. Animation by...

Recent Review

Little Ol Bosko In Bagdad

Average rating:

**Live Music** 131,731 concerts — Browse (by band)

Curator's Choice (more)

Yarn Live at Towne Crier Cafe on 2014-02-16

01. intro 02. Time Burns On 03. I Hate You 04. Down On Your Luck 05. Lost Cause 06. Christopher...

Recent Review

Grateful Dead Live at Merriweather Post Pavilion on 1985-06-30

Average rating:

**Audio** 2,095,303 recordings — Browse (by keyword)

Curator's Choice (more)

contra32: Infex - Type-E

How exactly does one create a golem? Although there are many variations in recorded methods and...

Recent Review

KM/TB Sol Rezza 2014

Average rating:

**Texts** 6,509,320 texts — Browse (by keyword)

Curator's Choice (more)

The Orchid world. A monthly illustrated journal...

No more published

Recent Review

الأسطوانة الرابعة 04 - أبحاث علمية - تربية وتعليم

Average rating:

**Most recent posts (write a post by going to a forum) more...**

| Subject | Poster | Forum | Replies | Date |
|---|---|---|---|---|
| PLEASE DELETE | kiwi9000 | forums | 0 | 1 hour ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: HELP!! need shows recommendations | wmonola | GratefulDead | 0 | 2 hours ago |
| Re: You don't have to ask, cause you already know | wmonola | GratefulDead | 0 | 2 hours ago |
| Re: HELP!! need shows recommendations | wmonola | GratefulDead | 0 | 2 hours ago |

**Institutional Support**

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఋగ్వేదసూక్తములు

# శ్రీ సాయణాచార్య భాష్యమునకు తెలుగు అనువాదము

(వ్యాకరణ స్వరవిశేషములతో)

అనువాదకర్త

డా॥ కురుమద్దాలి హయగ్రీవశర్మ
ఎం.ఎ., పిహెచ్.డి.,

మాధవి పబ్లికేషన్స్

1992

# విషయసూచిక

ఋగ్వేదసూక్తములు

# శ్రీ సాయణాచార్య భాష్యమునకు తెలుగు అనువాదము
## (వ్యాకరణ స్వర విశేషములతో)

### 1. అగ్నిసూక్తము

సంహితాపాఠము :

1) అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవమృత్విజం।
హోతారం రత్నధాతమమ్॥

పదపాఠము :

అగ్నిం। ఈళే। పురఃఽహితం। యజ్ఞస్య। దేవం।
ఋత్విజం। హోతారం। రత్నఽధాతమమ్॥

సాయణభాష్యము :

అగ్నినామకం దేవమీళే-స్తౌమి మంత్రస్యహోత్రా ప్రయోజ్యత్వా దహం హోతా స్తౌమీతిలభ్యతే. కీదృశమగ్నిం యజ్ఞస్య పురోహితం-యథారాజ్ఞః పురోహితస్తదభీష్టం సంపాదయతి తథాగ్నిరపి యజ్ఞ-స్యాపేక్షితం హోమంసంపాదయతి. పునఃకీదృశం, దేవం - దానాది గుణయుక్తం, హోతారమృత్విజం - దేవనాం యజ్ఞేషు హోతృనామక ఋత్విగగ్నిరేవ. పునరపి కీదృశం! రత్నధాతమం-యాగఫలరూపా-ణాం రత్నానామతి శయేనధారయితారం, పోషయితారం వా॥

సాయణభాష్యానువాదము :

అగ్నియను పేరుగల దేవం = దేవుని (హోతయగు నేను) ఈళే= స్తుతించుచున్నాను. ఎటువంటి అగ్నిని: యజ్ఞస్య పురోహితం = రాజ

పురోహితుడు రాజుయొక్క అభీష్టమును ఎట్లు నేరవేర్చునో అట్లే అగ్ని కూడా యజ్ఞమునకు కావలసిన హోమమును సమకూర్చును. అటువంటి అగ్నిని, దేవం=దానాది గుణములతోకూడుకొన్న వానిని, హోతారం = ఋత్విజం = దేవతల యజ్ఞములందు హోత అనుపేరుగల ఋత్విక్కు అగ్నియే అగుచున్నాడు. ఇంకనూ! రత్నధాతమం = యాగఫల రూపమగు రత్నములను గొప్పగా ధరించు వానిని, పోషించు వానిని స్తుతించుచున్నాను.

వ్యాకరణవిశేషములు :

"ఈళే" = ఈడస్తుతౌ అనుధాతువు. డకారమునకు ళ కారము బహ్వృచాధ్యేతృసంప్రదాయమువలన ఏర్పడినది. (అజ్ మధ్యస్థ డకారస్య ళకారం బహ్వృచా ఊచుః) అగ్నిశబ్దమునకు యాస్క నిర్వచనము."అగ్నిః కస్మాదగ్రణీర్భవత్యగ్రం యజ్ఞేషు ప్రణీయతే." "అగ్రణీః" = దేవసేనకు ముందుండి స్వయముగా అగ్నియే నడిపించును, "యజ్ఞస్యదేవం" = యజ్ఞమునకు మూలభూతుని, ప్రకాశింప చేయువానిని, "రత్నధాతమం" = రమణీయత్వాద్రత్నత్వం, రత్న శబ్దము ధననామములందు పఠించబడినది. దదాతిధాతువు ఇచ్చట దానార్థవాచి అగుచున్నది.

స్వరవిశేషములు :

రత్నధాతమం : ఇక్కడ రత్నశబ్దము "నఞ్ విషయస్యాని సంతస్య" అను ఫిట్‌సూత్రము (2-3) చే ఆద్యుదాత్తమును పొందెను. హోతారం-తృన్ ప్రత్యయాంతరూపము (పా.సూ. 3 2-134) ఞిత్ స్వరమువలన ఆద్యుదాత్తము వచ్చెను. (పా.సూ. 6-1-197)

సం॥ పా॥ 2) అగ్నిః పూర్వేభిర్ ఋషిభిరీడ్యో నూతనైరుత।
సదేవా ఏహ వక్షతి॥

పద॥పా॥ అగ్నిః। పూర్వేభిః। ఋషిఽభిః। ఈడ్యః। నూతనైః। ఉత।
సః। దేవాన్। ఆ। ఇహ। వక్షతి॥

సా॥ భా॥ : అయమగ్నిః, పూర్వేభిః-పురాతనైః భృగ్వంగిరః ప్రభృతిభిః ఋషిభిరీడ్యః-స్తుత్యః. నూతనైరుతేదానీంతనైరస్మాభిరపి స్తుత్యః. సోఽగ్నిః స్తుతస్సన్నిహ యజ్ఞే దేవాన్ హవిర్భుజ ఆవక్షతి-ఆవహత్విత్యర్థః

సా॥ భా॥ అను॥ : అయమగ్నిః = ఈఅగ్ని, పూర్వేభిః ఋషిభిః = ప్రాచీనులగు భృగువు అంగిరస్సు మొదలగు ఋషులచేత, ఈడ్యః = స్తుతించబడినవాడు, నూతనైరుత = ఈ కాలములో నున్న మనచేకూడా స్తుతింపదగినవాడు, సః = ఆ అగ్ని స్తోత్రమును పొందినవాడై, ఇహ = యజ్ఞమునందు, దేవాన్ = దేవతలకు హవిస్సులను (నైవేద్యములను) ఆవక్షతి = అందజేయుగాక!

వ్యా॥ వి॥ : పూర్వేభిః = ఇచ్చట "బహులం ఛందసి" అను (7-1-10) పాణిని సూత్రముచేత భిస్ ప్రత్యయమునకు ఐసాదేశము రాలేదు. ఋషిభిః = ఇన్ ప్రత్యయాంతముగ ఋషిశబ్దము "ఋష్యంధక" (4-1-114) అను పాణిని సూత్రమునందలి నిపాతమువలన ఏర్పడెను, లఘూపధగుణము రాలేదు. వక్షతి - వహతి ధాతువునకు లోడర్థమునందు ఛాందసమగు లృట్. ఆ లృట్‌కు వచ్చిన స్యప్రత్యయములోని యకారమునకు లోపముకూడా ఛాందసము.

స్వ॥ వి॥ : పూర్వేభిః, ఋషిభిః అను రెండుశబ్దములు నిత్స్వరమువలన (పా.సూ.7-3-86) ఆద్యుదాత్తమును పొందినవి. ఈడ్యః = ఈ శబ్దము ణ్యత్ ప్రత్యయాంతము గనుక "ఈడవందేత్యాది" (6-1-214) పాణినిసూత్రముచేత ఆద్యుదాత్తమును పొందెను.

సం॥ పా॥ 3) అగ్నినా రయి మశ్నవత్ పోషమేవ దివే దివే।
యశసం వీరవత్తమమ్॥

ప॥పా॥ అగ్నినా। రయిం। అశ్నవత్। పోషం। ఏవ। దివేఽదివే
యశసం। వీరవత్ఽతమమ్॥

సా॥భా॥: యోఽయంహోత్రా స్తుతోఽగ్నిస్తేనాగ్నినా నిమిత్తభూతేన యజమానః రయింధన మశ్నవత్ - ప్రాప్నోతి కీదృశం రయిం-దివే దివే పోషమేవ. ప్రతిదినం పుష్యమాణ తయా వర్ధమానమేవ నతుకదాచిదపి క్షీయమాణం. యశసం - దానాదినాయశోయుక్తం, వీరవత్తమం-అతిశయేనపుత్రభృత్యాది వీరపురుషోపేతం.

సా॥ భా॥ అను॥ : హోతచేత స్తుతించబడు అగ్ని, ఆ అగ్నిని నిమిత్తముగాగల యజమాని రయిం= ధనమును, అశ్నవత్=పొందుచున్నాడు, ఎటువంటి ధనమును? దివే దివే పోషమేవ = ప్రతిదినము వృద్ధిపొందునది, క్షీణదశను ఎన్నటికీ పొందనిది అని అర్థము. యశసం = ధానధర్మాదులచేత యశోవంతమైనది, వీరవత్తమమ్=మిక్కిలి వీరపురుషులగు పుత్రులు, సేవకులతోకూడినది.

వ్యా॥ వి॥ : రయి శబ్దము మఘం మొదలగు ధననామములందు పఠించబడినది. అశ్నవత్ = అశూవ్యాప్తౌ అను ధాతువునకు లేట్‌నందు వ్యత్యయముగా అప్ ప్రత్యయము, ఇతశ్చలోపః (3-4-97) అను పాణిని సూత్రముచే ఇకారలోపము, "లేటోఽడాటౌ" అను (3-4-94) పాణిని సూత్రముచే అడాగమము వచ్చి అశ్నవత్ అని అగుచున్నది.

స్వ॥వి॥ పోషం : పోషశబ్దము ఘఞ్ ప్రత్యయాంతమగుటవలన (6-1-197) పాణిని సూత్రముచే ఆద్యుదాత్తమును పొందెను. వీరవత్ఽతమం = ఫిట్ స్వరముచేత అంతోదాత్తమగు వీరశబ్దమునకంటె

పరములోనున్న తమప్, మతుప్ ప్రత్యయములు పిత్వములగుటవలన అనుదాత్తమేర్పడెను.

సం॥పా॥ 4) అగ్నే యం యజ్ఞమధ్వరం విశ్వతః పరిభూరసి।
స ఇద్దేవేషు గచ్ఛతి॥

ప॥ పా॥ : అగ్నే। యం। యజ్ఞం। అధ్వరం। విశ్వతః।
పరిఽభూః। అసి। సః। ఇత్। దేవేషు। గచ్ఛతి॥

సా॥ భా॥ : హే అగ్నే! త్వం, యం యజ్ఞం, విశ్వతః=సర్వాసు దిక్షు, పరిభూః-పరితః ప్రాప్తవానసి, సఇత్-సఏవ యజ్ఞః, దేవేషు తృప్తిం ప్రణేతుం స్వర్గే గచ్ఛతి. ప్రాచ్యాది చతుర్దిగంతేష్వాహవనీయమార్జాలీయ గార్హపత్యాగ్నీధ్రీయస్థానేష్వగ్నిరస్తి. కీదృశం యజ్ఞం అధ్వరం-హింసారహితం, నహ్యగ్ని నాసర్వతః పాలితం యజ్ఞం రాక్షసాదయోహింసితుం ప్రభవంతి.

సా॥ భా॥ అను॥ : ఓ అగ్నే! నీవు యం యజ్ఞం = ఏ యజ్ఞమును, విశ్వతః = అన్ని దిక్కులయందు, పరిభూరసి = వ్యాపింపచేసినావో, సఇత్ = ఆ యజ్ఞము, దేవేషు = దేవతలకు తృప్తినికలుగ చేయుటకు స్వర్గమునందు, గచ్ఛతి = సంచరించుచున్నది. (తూర్పు మొదలగు దిక్కులకు మూలలందు అహవనీయ = మార్జాలీయ - గార్హపత్యాగ్నీధ్రీయ స్థానములందు అగ్ని ఉన్నాడు.) ఎటువంటి యజ్ఞమును? అధ్వరం = హింసారహితమైనది. అగ్ని చేత అన్నివైపులాపాలించబడు యజ్ఞమును రాక్షసాదులు హింసించలేరు.

స్వా॥వి॥ అగ్నే : అగ్నిశబ్దమునకు పాణిని సూత్రముచే (ఫి-1-198) ఆ మంత్రితాద్యుదాత్తము వచ్చెను. అధ్వరం = "న విద్యతే ధ్వరః అస్య" అని బహువ్రీహి సమాసమునందు "నఞ్ సుభ్యాం"

అను (6-2-172) పాణిని సూత్రముచేత అంతోదాత్తమేర్పడినది. విశ్వతః = ఇచ్చట "తసిల్"నకు ప్రత్యయ స్వరము బాధించబడి దానికి పూర్వవర్ణమునకు లితి అను (6-1-193) పాణిని సూత్రముచే ఉదాత్తము వచ్చెను. (శ్వ అనుదానికి)

సం॥పా॥ 5) అగ్నిర్‌హోతా కవిక్రతుః సత్యశ్చిత్రశ్రవస్తమః।
దేవోదేవేభి రాగమత్॥

ప॥భా॥ అగ్నిః। హోతా। కవిఽక్రతుః। సత్యః। చిత్రశ్రవఃఽతమః।
దేవః। దేవేభిః। ఆ। గమత్॥

సా॥ భా॥ : అయమగ్నిర్దేవః అస్యైర్దేవైర్హవిర్భోజిభిః సహా-గమత్ అస్మిన్ యజ్ఞే సమాగచ్ఛతు. కీదృశోఽగ్నిః హోతా - హోమ నిష్పాదకః, కవిక్రతుః-క్రాంతప్రజ్ఞః క్రాంతకర్మావా, సత్యః-అనృత రహితః, ఫలమవశ్యం ప్రయచ్ఛతీత్యర్థః చిత్రశ్రవస్తమః అతి శయేన వివిధకీర్తియుక్తః

సా॥ భా॥ అను॥ : ఈ అగ్ని దేవుడు దేవేభిః = హవిస్సును స్వీకరించు ఇతర దేవతలతోకూడా "ఆగమత్" = ఈ యజ్ఞమునందు వచ్చుగాక, ఎటువంటి అగ్ని? హోతా = హోమమును నిష్పాదనచేయు వాడు, కవిక్రతుః = క్రాంతప్రజ్ఞుడు, సత్యః = అసత్యములేనివాడు, ఫలమును తప్పక ఇచ్చువాడు, చిత్రశ్రవస్తమః = గొప్పవగు వివిధ కీర్తులతోకూడినవాడు.

వ్యా॥వి॥ : గమత్=లోడంతమగు గచ్ఛతు అను ధాతురూపము నకు ఛత్వమురాలేదు. అకారలోపము ఛాందసము (వైదికము) కనుక "గమత్" అని ఏర్పడెను.

స్వ॥ వి॥ : కవిఽక్రతుః, చిత్రశ్రవఃఽతమః : అను ఈరెండు సమస్తపదములు బహువ్రీహిసమాసములగుటవలన పూర్వపదమునకు

ప్రకృతి స్వరము (ఉదాత్తము) వచ్చెను, సత్యః = సత్సుసాధుః సత్యః అని వ్యుత్పత్తి, సత్యాదశపథే అను (5-4-66) పాణిని సూత్రమునందు అంతోదాత్తము హరదత్తునిచే నిపాతము చేయబడినది.

సం॥ పా॥ 6) యదంగ దాశుషే త్వమగ్నే భద్రంకరిష్యసి।
తవేత్తత్సత్య మంగిరః॥

ప॥ పా॥ యత్। అంగ। దాశుషే। త్వం। అగ్నే। భద్రం।
కరిష్యసి। తవ। ఇత్। తత్। సత్యం। అంగిరః॥

సా॥ భా॥ : అంగాగ్నే-హే అగ్నే, త్వందాశుషే-హవిర్దత్తవతే యజమానాయత్రీప్త్యర్థం యద్భద్రం. విత్తగృహ ప్రజాపశురూపం కల్యాణం కరిష్యసి, తద్ భద్రం తవేత్-తవైవ సుఖహేతురితి శేషః. హే అంగిరః-అగ్నే, ఏతచ్చసత్యం నత్వత్రవిసంవాదోఽస్తి. యజమానస్యవిత్తాది సంపత్తౌ సత్యాముత్తరక్రత్వనుష్ఠానేనాగ్నే రేవ సుఖంభవతి.

సా॥ భా॥ అను॥ : అంగాగ్నే = ఓ అగ్నీ! త్వందాశుషే = నీవు హవిస్సులను నీకు సమర్పించిన యజమానికి ప్రీతిని కలుగజేయుటకు యద్ భద్రం = విత్తము, గృహము, సంతానము, పశురూపనుగు ఏ కల్యాణము చేయదలచితివో, తద్ భద్రం = ఆకల్యాణము, తవేత్ = నీకు సుఖమును కలుగచేయుటకు కారణమగును. హే అంగిరః = ఓ అగ్నీ ఏతచ్చసత్యం=ఇది యదార్థము, ఇందు విసంవాదమేమీలేదు. యజమానికి విత్తాదిసంపదలు కలిగినపుడు మరల యాగమును అనుష్ఠించుటవలన అగ్నికే సుఖము కలుగుమ.

వ్యా॥ వి॥ : భద్రం=భద్రశబ్దార్థమును శాట్యాయనమతానుయాయులు ఇట్లు చెప్పుచున్నారు. = యద్వై పురుషస్యవిత్తం తద్భ-

ద్రం గృహే భద్రం ప్రజాభద్రం పశవో భద్రమితి"। అంగిరః - అంగిరా అంగారాః (నిరుక్తం (3-17) అని యాస్కవచనము. ఐత రేయానుయాయులు ప్రజాపతి దుహితృధ్యానోపాఖ్యానము" నందు చెప్పుచున్నారు = యేంఽగారా ఆసంస్తేంఽంగిరసోఽభవన్" ఇతి (ఐ. బ్రా. 3-34), అంగిరుడను ముని కారణమువలన అంగారరూప మగు అగ్నికి అంగిరత్వమేర్పడెను.

స్వ॥ వి॥ : అంగ = అంగశబ్దము నిపాత అయినప్పటికి పిట్ సూత్రమువలన (4-12) అంతోదాత్తుము పొందెను. అగ్నే! = ఆమంత్రితమగు అగ్నిశబ్దమునకు పదాత్పరమయినందున అష్టమి కానుదాత్తము (పా.సూ.8-1-19) శంకించుటకువీలులేదు, "అపాదాగౌ" (పా.సూ.8-1-18)అని నిషేధము చేయుటవలన షాష్ఠికమగు (పా.సూ. 1-6-198) ఆద్యుదాత్తమే వచ్చెను, తవ = ఇచ్చట "యుష్మదస్మదో ర్ఙసి" (6-1-211) అను పాణిని సూత్రముచేత ఆద్యుదాత్తమువచ్చెను.

సం॥పా॥ 7) ఉపత్వాగ్నే దివేదివే దోషావస్తర్ధియావయమ్।
నమోభరంత ఏమసి॥

ప॥పా॥ ఉప। త్వా। అగ్నే। దివేఽదివే। దోషాఽవస్తః ధియా। వయమ్। నమః। భరంతః। ఆ। ఇమసి॥

సా॥ భా॥ : హే అగ్నే వయం-అనుష్ఠాతారో దివేదివే - ప్రతి దినం దోషావస్తా-రాత్రావహనిచ, ధియా-బుద్ధ్యా, నమోభరంతః - నమస్కారం సంపాదయంతః, ఉప-సమీపే, త్వామసి-త్వామా గచ్ఛామః.

సా॥ భా॥ అను॥ : హే అగ్నే = ఓ అగ్నీ! వయం = అనుష్ఠాత లగు మేము, దివేదివే = ప్రతిదినము, దోషావస్తః = రాత్రింబవళ్ళు,

దియా = ప్రజ్ఞచేత, నమోభరంతః = నమస్కారమును సంపాదించుకొని, ఉపత్వైమసి = నీ సమీపమునకు వచ్చుచున్నాము.

స్వ॥ వి॥ : ఉప = ఉప అనుదానికి నిపాతస్వరము "ఆద్యుదాత్తః" (4-12) అను పిట్‌సూత్రముచే వచ్చెను. త్వా = "త్వామౌ ద్వితీయాయాః"(8-1-23) అనుపాణినిసూత్రముచేత యుష్మచ్ఛబ్దమునకు అనుదాత్తస్వరముతోకూడిన త్వాదేశము వచ్చెను.దోషాऽవస్తః= దోషాశబ్దము రాత్రివాచి,వస్తః అనునది పగలు అను అర్థమును తెలియచేయును, ద్వంద్వసమాసమునందు కార్తకౌజపాదిత్వాత్" అను (6-2-37) పాణిని సూత్రముచేత ఆద్యుదాత్తము వచ్చెను. ధియా- "సావేకాచః" అను (6-1-128) పాణిని సూత్రముచేత ధీశబ్దమునకు సంబంధించిన తృతీయావిభక్తి ప్రత్యయము ఆ అనుదానికి ఉదాత్తము ఏర్పడెను. భరంతః = భరంతః అనుచోట శప్‌పిత్ అగుటవలన (3-1-68) పై పాణినిసూత్ర ప్రకారము శతృ ప్రత్యయములసార్వధాతుకమగుటచేత అనుదాత్తస్వరము వచ్చుచుండగా (6-1-186) పాణిని సూత్రముచే చివరకు దాతుస్వరము (ఉదాత్తము) మిగిలెను.

సం॥ పా॥ 8) రాజంత మధ్వరాణాం గోపామృతస్య దీదివిమ్।
వర్థమానం స్వేదమే॥

ప॥పా॥ రాజంతం। అధ్వరాణాం। గోపాం। ఋతస్య। దీదివిమ్।
వర్ధమానం। స్వే। దమే।

సా॥ భా॥ పూర్వమంత్రేత్వాముపైమ ఇత్యగ్నిముద్దిశ్యోక్తం. కీదృశంత్వాం - రాజంతం - దీప్యమానం. అధ్వరాణాం-రాక్షసకృతహింసారహితానాం యజ్ఞానాం, గోపాం-రక్షకం, ఋతస్య-సత్యస్యావశ్యం భావినః కర్మఫలస్య, దీదివిం-పౌనఃపున్యేన భృశంవాద్యోతకం,

ఆహుత్యాధారమగ్నిం దృష్ట్వాశాస్త్ర ప్రసిద్ధం కర్మఫలం స్మర్యతే స్వేదమే-స్వకీయగృహే యజ్ఞశాలాయాం హవిర్భిః వర్ధమానం.

సా॥ భా॥ అను॥ : పూర్వమంత్రమునందు అగ్నిముద్దేశించి "నీవద్దకు వచ్చుచున్నాము"అని విశదింపబడినది. ఎటువంటి అగ్నిని? రాజంతం = ప్రకాశించుచున్న, అధ్వరాణాం = రాక్షసకృతమగు హింసలులేని యజ్ఞములను, గోపాం = రక్షించువానిని, ఋతస్య = సత్యమును (మానవులకు ఏర్పడు కర్మఫలమును) దీదివిం = మిక్కిలి ప్రకాశింపచేయువాడు, ఆహుతులకు ఆధారమగు అగ్నినిచూచి శాస్త్ర-ప్రసిద్ధమగు కర్మఫలము స్మరించబడుచున్నది. స్వేదమే = తన గృహమునందు (యజ్ఞశాలయందు హవిస్సులచేత) వర్ధమానం = వృద్ధిపొందువాడు.

స్వ॥ వి॥ : రాజంతం, వర్ధమానం-అను రెండుచోట్ల ఇంతకు ముందు మంత్రములోవలె ధాతుస్వరము (ఉదాత్తము ఏర్పడెను. దీదివిం = దీదివి శబ్దమునకు "అభ్యస్తానామాదిః" (6-1-189) అను పాణినిసూత్రముచేత ఆద్యుదాత్తము ఏర్పడెను. దమే = దమశబ్దము వృషాదియగుటవలన (6-1-203) పైసూత్రముచేత ఆద్యుదాత్తమును పొందెను.

సం॥ పా॥ 9) సనః పితేవ సూనవేఽగ్నే సూపాయనో భవ।
సచస్వా। నః స్వస్తయే॥

ప॥ పా॥ సః। నః। పితాఽఇవ। సూనవే। అగ్నే।
సుఽఉపాయనః। భవ। సచస్వ నః। స్వస్తయే॥

సా॥ భా॥ : హే అగ్నే సత్వం నః-అస్మదర్థం, సూపాయనః-శోభనప్రాప్తియుక్తః భవ. తథానః-అస్మాకం, స్వస్తయే - వినాశ-

రాహిత్యార్థం, సచస్వ-సమవేతో భవ. తత్రోపయుక్తదృష్టాంతః - యథాసూనవే - పుత్రార్థం పితాసుప్రాయః ప్రాయేణ సమవేతో భవతి తద్వత్.

సా॥ భా॥ అను॥ : హే అగ్నే! = ఓ అగ్ని! సత్వం = ఆనీవు, నః = మా కొరకు, సూపాయనః = శుభప్రదమైన వాటితోకూడిన-వాడుగా, భవ = ఉండుగాక! అట్లే నః = మాకు, స్వస్తయే-వినాశము కలుగకుండా (రక్షణకొరకు) సచస్వ=సిద్ధముగానుండు. దృష్టాంతము-ఎట్లనగా, సూనవే=పుత్రుని కొరకు, పితా = తండ్రి శుభకరమగు వస్తువులను సిద్ధముచేసి, పుత్రుని రక్షణకొరకు సన్నద్ధుడగునో అట్లు.

స్వ॥ వి॥ : నః - అస్మచ్ఛబ్దాదేశమగు "న" అను దానికి "అనుదాత్తం సర్వం" అను (8-1-18) పాణిని సూత్రముచేత అను-దాత్తము వచ్చెను. పితేవ-"చాదయోఽనుదాత్తః" అను (4-16) ఫిట్ సూత్రముచేత పదపాఠములో ఇవఅనునది అనుదాత్తమునుపొందెను. "ఇవేన నిత్యసమాసః పూర్వపద ప్రకృతి స్వరత్వం చ వక్తవ్యం" అను (2-1 4,2) పాణిని సూత్రముచేత నిత్య సమాసము వచ్చిన తరువాత పితేవ అను సమస్త పదము మధ్యోదాత్తమును పొందెను. "సుఽఉపాయనః-శోభనం ఉపాయనం యస్య అను బహువ్రీహి సమాసమునందు నఞ్ సుభ్యాం" అను సూత్రముచేత అంతోదాత్త-మేర్పడెను.

-o-

## 2. సవితృసూక్తము

పం॥ పా॥ 1) హ్వయామ్యగ్నిం ప్రథమం స్వస్తయే
హ్వయామి మిత్రా వరుణా విహావసే॥
హ్వయామి రాత్రీం జగతో నివేశనీం
హ్వయామి దేవం సవితార మూతయే॥

ప॥పా॥ హ్వయామి। అగ్నిం। ప్రథమం। స్వస్తయే। హ్వయామి।
మిత్రావరుణౌ। ఇహ। అవసే। హ్వయామి। రాత్రీం।జగతః
నిఽవేశనీం। హ్వయామి। దేవం। సవితారం। ఊతయే॥

సా॥ భా॥ : స్వస్తయే-అస్మాకమవినాశాయ, ప్రథమమ్-ఆదౌ అగ్నిం హ్వయామి. ఇహ - అస్మిన్ కర్మణి, అవసే-అస్మద్రక్షణాయ, మిత్రావరుణౌహ్వయామి, జగతః-జంగమస్య ప్రాణిజాతస్య నివేశనీం ఉపనివేశనహేతుభూతాం, రాత్రీం - రాత్రి దేవతాం హ్వయామి. జఙ్గమాః సర్వేప్రాణినో దివసేష్వవ్యాపారాన్ కృత్వాస్వ స్వగృహే రాత్రౌ ఉపవిశన్తీతి ప్రసిద్ధమ్. ఊతయే-అస్మద్రక్షణార్థం సవితారం దేవం హ్వయామి.

సా॥భా॥అను॥ : స్వస్తయే = మాకు నాశనములేకుండుటకొరకు (మాక్షేమముకొరకు) ప్రదమమ్ = ముందు, అగ్నిం హ్వయామి = అగ్నిని ఆహ్వానించుచున్నాను. ఇహ = ఈ కర్మానుష్ఠానమునందు, అవసే=మనరక్షణకొరకు, మిత్రావరుణౌహ్వయామి = మిత్రావరుణు-లను ఆహ్వానించుచున్నాను. జగతః = లోకములోని సకలప్రాణులు, నివేశనీం = విశ్రమించుటకు కారణభూతురాలగు రాత్రీం = రాత్రి దేవతను, హ్వయామి = ఆహ్వానించుచున్నాను. సకలవిధప్రాణులు పగలు వారివారి పనులనుపూర్తి చేసుకొనివారివారిఇండ్లలో రాత్రియందు

నివసిస్తూంటారు. ఊతయే=మా రక్షణకొరకు, సవితారం దేవం=సవితృ దేవతను, హ్వయామి = ఆహ్వానించుచున్నాను,

వ్యా॥ వి॥ : హ్వయామి = హ్వాధాతువు పిలుచుట, స్తుతించుట అను అర్థములందు ప్రయోగించబడును, వర్తమానకాలము, ఉత్తమ పురుషైకవచనము. మిత్రావరుణౌ + ఇహ=మిత్రావరుణావిహ-ఔకార స్థానములో ఆవ్ ఆదేశము వచ్చినది, దీనిని వైదికభాషలో "ఋగ్న్న-సంధి" అందురు. అవసే = చతుర్థ్యేకవచనరూపము, అవరక్షణే అను-ధాతువునుండి ఏర్పడినది. నివేశనీమ్ = ని అను ఉపసర్గపూర్వక-ముగా విశ ప్రవేశనే అనుధాతువునకు ల్యుట్ ప్రత్యయము దానికి అనాదేశము, జీప్ ప్రత్యయముచేయుగా రూపంఏర్పడెను. ఊతయే= చతుర్థ్యేకవచనము, అవరక్షణే అనుధాతువునకు క్తిన్ ప్రత్యయము చేయుగా జ్వరత్వర స్రివ్యవిమవాముపధాయాశ్చ" (6-4-20) అను పాణిని సూత్రముచే వకారమునకు, ఉపధావర్ణమగు అకారమునకు ఊకారము (ఊఠ్) విధించగా రూపము సిద్ధించెను.

స్వ॥ వి॥ : హ్వయామి - పాద ప్రారంభమందుండుటవలన ఉదాత్తస్వరము వచ్చెను. మిత్రావరుణౌ = అనునది ద్వంద్వసమా-సము, రెండుపదములూ దేవతల పేర్లు, దేవతాద్వంద్వేచ (6-2-141) అను పాణిని సూత్రముచే రెండు పదములకు ప్రకృతి స్వరము (ఉదాత్తము) సిద్ధించినది.

సం॥ పా॥ : 2) ఆకృష్ణేన రజసావర్తమానో నివేశయన్న
మృతం మర్త్యంచ।
హిరణ్యయేన సవితారథేనాదేవో యాతి భువనా
నిపశ్యన్॥

వ॥ పా॥ ఆ। కృష్ణేన। రజసా। వర్తమానః। ని౽వేశయన్।
అమృతమ్। మర్త్యం। చ। హిరణ్యయేన। సవితా।
రథేన। ఆ। దేవః। యాతి। భువనాని। పశ్యన్।

సా॥ భా॥ : సవితా-సూర్యః, కృష్ణేనరజసా-కృష్ణవర్ణేనలోకేన (అన్తరిక్షలోకోహి సూర్యాగమనాత్ పురాకృష్ణవర్ణోభవతి.) తేనాన్తరిక్ష మార్గేణ, ఆ వర్తమానః - పునః పునరాగచ్ఛన్, అమృతం - దేవం, మర్త్యం-మనుష్యం చ, నివేశయన్-స్వస్వస్థానేఽవస్థాపయన్, మర్త్యాని హిమానిశరీరాణి అమృతైషాదేవతా (ఐ. బ్రా. 2-1-8) యథోక్త-గుణోపేతః సవితాదేవః భువనాని-సర్వాన్‌లోకాన్, పశ్యన్-అవేక్షమాణః ప్రకాశయన్, హిరణ్యయేన-సువర్ణనిర్మితేన, రథేన ఆ యాతి-అస్మత్స మీపమాగచ్ఛతి.

సా॥ భా॥ అను॥ : సవితా = సూర్యుడు, కృష్ణేరజసా = నీల-వర్ణముతోకూడిన లోకముద్వారా (ఆకాశము సూర్యాగమనమునకు పూర్వము నీలవర్ణముగా ఉండును.) ఆ అంతరిక్షమార్గముగుండా, ఆ వర్తమానః = మరల మరల పయనించుచూ, అమృతం = దేవుని, మర్త్యం=మనుష్యుని, నివేశయన్=ఆయాస్థానములందు స్థాపించుచూ ఉక్తగుణములతోకూడిన సవితృదేవత, భువనాని = అన్నిలోకములను పశ్యన్ = చూచుచూ (ప్రకాశింపచేయుచూ) హిరణ్యయేన=బంగార-ముతో నిర్మించబడిన, రథేన = రథముద్వారా, ఆయాతి = మన సమీపమునకు వచ్చుచున్నాడు.

వ్యా॥ వి॥ : ఆవర్తమానః = వృతువర్తనే అనుధాతువునుండి ఏర్పడిన వర్తమానకాలికరూపము, ఆ అను ఉపసర్గసుబంతమునుండి వేరు చేయబడినది. ని౽వేశయన్ = ని అను ఉపసర్గవర్తమానకాలిక

విశ ధాతువుయొక్క సుబంతరూపముతో సమాసమును పొందినది. ఆయాతి = ఆ అను ఉపసర్గపూర్వకముగా యా ప్రాపణే అనుధాతువు నకు వర్తమానకాలిక ప్రథమపురుషైకవచనము.

స్వ॥ వి॥ : అవర్తమానః- క్రియాపదమునకువలె, స్వతంత్ర-మైన పదమునకువలె ఉదాత్తస్వరము ఏర్పడెను. నిఽవేశయన్=ఈ పదము అనుదాత్తస్వరముహొందినదై పదపాఠములోఅవగ్రహద్వారా ఉపసర్గనుండి వేరుచేయబడినది. అమృతమ్‌బహు వ్రీహిసమాసము నఞోనందుజరమరమిత్రమృతాః"(6-2-116)అనుపాణిని సూత్రముచే ఉత్తరపదాద్యుదాత్త స్వరమేర్పడినది, మర్త్యమ్ = యత్ ప్రత్యయముతో అంతమగు పదము "యతోఽనావః" (6-2 213) అను పాణిని సూత్రముచే అద్యుదాత్తమును పొందినది.

సం॥ పా॥ 3) యాతిదేవః ప్రవతాయాత్యుద్వతా
యాతి శుభ్రాభ్యాం యజతోహరిభ్యామ్॥
ఆదేవో యాతిసవితా పరావతోఽప
విశ్వాదురితా బాధమానః॥

ప॥పా॥ యాతి। దేవః। ప్రఽవతా। యాతి। ఉత్ఽవతా। యాతి। శుభ్రాభ్యాం। యజతః। హరిఽభ్యామ్। ఆ। దేవః। యాతి సవితా। పరాఽవతః। అప। విశ్వా। దుఃఽఇతా। బాధ-మానః॥

సా॥ భా॥ : దేవః - దీప్యమానః సవితా, ప్రవతా- ప్రవణతా మార్గేణ, యాతి_గచ్ఛతి, తథాఉద్వతా ఉత్కృష్టేనోర్ధ్వదేశయుక్తేన మార్గేణ, యాతి ఉదయానన్తరం ఆ మధ్యాహ్నమూర్ధ్వో మార్గః, తత ఉపరి అసాయం ప్రవణోమార్గ ఇతి విశేషః తథాయజతః_యష్టవ్యః

సదేవః శుభ్రాభ్యాం-శ్వేతాభ్యాం, హరిభ్యాం-అశ్వాభ్యాం, యాతి - దేవ యజనదేశే గచ్ఛతి. సవితాదేవః-విశ్వాదురితా-సర్వాణిపాపాని, అపబాధమానః-వినాశయన్, పరావతః - దూరదేశాత్, బాదృకాత్ ద్యులోకాత్, ఆయాతి-యాగదేశే ఆగచ్ఛతి.

పా॥ భా॥ అను॥ : దేవః = ప్రకాశించు సవిత, ప్రవతా = అధో మార్గముగుండా, యాతి = వెళ్ళుచున్నాడు. అట్లే ఉద్వతా = ఊర్ధ్వ దేశమార్గముగుండా, యాతి = వెళ్ళుచున్నాడు. (ఉదయమునుండి మధ్యాహ్నమువరకు ఊర్ధ్వమార్గము తరువాత సాయంకాలము వరకు అధోమార్గము) యజతః = పూజనీయుడగు ఆ దేవుడు, శుభ్రాభ్యాం= తెల్లని, హరిభ్యాం = గుఱ్ఱములతో, యాతి = దేవతలను పూజించు ప్రదేశమునకు పయనించుచున్నాడు, సవితాదేవః సవితృ-దేవత, విశ్వాదురితా = అన్ని పాపములను, అపబాధమానః = నాశనమొనరుచూ పరావతః=దూర ప్రదేశమునుండి(ఆకాశమునుండి) ఆ యాతి = యాగశాలకు వచ్చుచున్నాడు.

వ్యా॥ వి॥ : అపబాధమానః = అప అను ఉపసర్గసహితముగా "బాధృలోడనే" అను ఆత్మనేపదధాతువుయొక్క వర్తమాన కాలిక రూపము.

స్వ॥వి॥ : యాతిపాద ప్రారంభములో ఉండుటచే యా అనునది ఉదాత్తస్వరమును పొందినది. అట్లే రెండవపాదములో నున్న మూడవ "యాతి" అనునదికూడా. రెండవయాతి నూతన వాక్యమును ప్రారంభించును కనుక ఉదాత్తమును పొందినది.

సం॥ పా॥ 4) అభీవృతం కృశనైర్విశ్వరూపమ్

హిరణ్యశమ్యం యజతో బృహన్తమ్॥

ఆస్థాద్రథం సవితా చిత్రభానుః
కృష్ణారజాంసిత విషీందదానః॥

ప॥ పా॥ : అభిఽవృతం। కృశనైః। విశ్వఽరూపమ్। హిరణ్యఽశమ్యం। యజతః।
బృహన్తమ్। ఆ। అస్థాత్. రథం। సవితా। చిత్రఽభానుః। కృష్ణా। రజాంసి। తవిషీం। దధానః॥

సా॥ భా॥ సవితా రథం ఆస్థాత్-ఆస్థితవాన్, కీదృశమ్ః అభీవృతమ్ - అభితోవర్తమానమ్, తథాకృశనైర్విశ్వరూపం - సువర్ణేన నానారూపమ్. క్వచిత్ సువర్ణ నిర్మితగజపఙ్క్తిః క్వచిదశ్వపఙ్క్తిః, క్వచిన్మ నుష్యపఙ్క్తిరిత్యేవం బహురూపత్వమ్, హిరణ్యశమ్యమ్ - అశ్వానాంస్కన్ధేషు రథయోజనవేలాయాం నియన్తుంప్రక్షేప్యమాణాః శఙ్కవఃశమ్యాః, తాఃసువర్ణమయ్యోవర్తన్తే రథే-బృహంతం-ప్రౌఢమ్, కీదృశః సవితా,యజతః-యష్టవ్యః, చిత్రభానుః-వివిధరశ్మియుక్తః, కృష్ణారజాంసి-అంధకారయుక్తతయా కృష్ణవర్ణాన్ లోకానుద్దిశ్యతమో నివారణార్థం, తవిషీం-బలం స్వకీయం ప్రకాశరూపం దధానః।

సా॥ భా॥ అను॥ : సవితా = సూర్యుడు, రథం = రథమును, ఆస్థాత్ = అధిరోహించెను, ఎటువంటి రథమును? అభీవృతమ్ = చుట్టు ప్రక్కల వ్యాపించిన, కృశనైర్విశ్వరూపమ్ = బంగారముతో అనేక రూపములతోకూడినది. ఒకచోట బంగారముతో నిర్మించిన ఏనుగుల వరుస, మరొకచోట గుఱ్ఱములవరుస, ఇంకొకచోట మనుష్యులవరుస (ఇట్లు బహురూపత్వము) హిరణ్యశమ్యమ్=గుఱ్ఱములను రథమునకు కట్టుటకు ఉపయోగించు గొలుసులు (బంధములు) బంగారముతో

చేయబడినవి, బృహంతం = విశాలమగు రథమును, అస్థాత్ = అధి-రోహించెను, ఎటువంటి సూర్యుడు? యజతః = పూజనీయుడు, చిత్రభానుః = వివిధరశ్మలతో కూడినవాడు, కృష్ణారజాంసి=అంధకారముతో కూడుకున్న లోకములనుగూర్చి అంధకారమును (చీకటిని) నివారించుటకొరకు, తవిషీం = తనయొక్క ప్రకాశరూపమగు బలమును, దధానః = ధరించినవాడు.

వ్యా॥ వి॥ : అభీవృతమ్ = అభి అను ఉపసర్గపూర్వకముగా వృతువర్తనే ధాతువునకు క్విప్ ప్రత్యయము విధించబడి సమాసమునందు వృతమ్ అనునది ఉత్తరపదముగా ఉన్నది. "నహి వృతి వృషి వ్యధి రుచి సహితనిఘక్వౌ" (6-3-116) అను పాణినిసూత్రముచే పూర్వపదమునకు దీర్ఘ మేర్పడెను. కృశనైః=ఈ పదము హిరణ్యనామములందు పేర్కొనబడెను. [నిఘంటువు I,2-6] Macdonell అభిప్రాయము ప్రకారము కృశనైః అనగా నక్షత్రములని అర్థము. హిరణ్యఽశమ్యమ్ = బంగారు గొలుసులతో కూడినది. [Wilson] బంగారుకడ్డీ [Griffith] బంగారుసూది [Macdonell]. అస్థాత్=ష్ఠాగతి నివృత్తౌ అను ధాతువునకు లుజ్ ప్రథమపురుషైకవచనము. చిత్రఽభానుః = వివిధరశ్మలతోకూడినవాడు, బహువ్రీహిసమాసము.

స్వ॥వి॥ : "విశ్వరూపమ్-బహువ్రీహౌ విశ్వం సంజ్ఞాయామ్" [6-2-106] అను పాణిని సూత్రముచే బహువ్రీహిలో పూర్వపదములోని రెండవవర్ణము నామవాచకము కాకపోయినా ఉదాత్తమును పొందినది. హిరణ్యఽశమ్యమ్ = ఇది బహువ్రీహిసమాసము కావున పూర్వపదములోని మొదటి వర్ణమునకు ఉదాత్తము వచ్చెను. చిత్రఽ

ఖానుః = ఇదీ బహు వ్రీహిసమాసము. ఇందుకూడా పూర్వపదము-లోని రెండవవర్ణమునకు ఉదాత్తము వచ్చెను.

సం॥ పా॥ 5) విజనాఞ్ఛ్యావాః శితిపాదో
అఖ్య న్రథం హిరణ్య ప్రఉగంవహన్తః।
శశ్వద్విశః సంవితుర్దైవ్యస్యోపస్థే
విశ్వా భువనాని తస్థుః।

ప॥ పా॥ వి। జనాన్। శ్యావాః। శితిఽపాదః। అఖ్యన్। రథమ్। హిరణ్యఽప్రఉగమ్।వహన్తః। శశ్వత్। విశః।సవితుః। దైవ్యస్య।
ఉపఽస్థే। విశ్వా। భువనాని। తస్థుః।

సా॥ భా॥ శ్యావాః-ఏతన్నామకాః సూర్యస్యాశ్వాః, తేచశితి-పాదః-శ్వేతైః పాదైరుపేతాః, హిరణ్యప్రఉగమ్ - రథస్యముఖమ్ ఈషయోరగ్రంయుగబన్ధనస్థానం ప్రఉగమిత్యుచ్యతే. తచ్చాత్ర సువర్ణమయమ్, తద్యుక్తం రథంవహన్తః జనాన్-ప్రాణినః, విఅఖ్యన్ విశేషేణప్రకాశితవన్త ఇత్యర్థః. శశ్వత్-సర్వదా, విశః - ప్రజాః, దైవ్యస్య-ఇతర దేవసంబంధినః, సవితుః-ప్రేరకస్య సూర్యస్య, ఉపస్థే-సమీపస్థానే, తస్థుః-స్థితవత్యః, నకేవలం ప్రజాఃకింతర్హి,విశ్వా భువనాని-సర్వే చలోకాః ప్రళయాయ సూర్యసమీపేతస్థుః.

సా॥ భా॥ అను॥ శ్యావాః = శ్యావములనుపేరుగల సూర్యా-శ్వములు, శితిపాదః = తెల్లనిపాదములతోకూడుకొనినవి, హిరణ్య-ప్రఉగమ్ = రథముఖము, అశ్వములను రథమునకుకట్టుప్రదేశము "ప్రఉగ" మనబడును, ఇది సువర్ధమయము. అటువంటి రథమును

మోయుచూ, జనాన్ = ప్రాణులను, వ్యఖ్యన్ = విశేషముగా ప్రకా-శింపచేసినవి, శశ్వత్ = ఎల్లపుడూ, విశః = ప్రజలు, దైవ్యస్య = ఇతర దేవతలకు సంబంధించిన, సవితుః = ప్రేరకుడగు సూర్యుని-యొక్క, ఉపస్థే = సమీపస్థానమునందు, తస్థుః=ఉండిరి. కేవలము ప్రజలేకాదు, విశ్వాభువనాని = అన్నిలోకములు ప్రకాశించుటకొరకు సూర్యుని సమీపములో ఉండినవి.

వ్యా॥ వి॥ : జనాఞ్ఛ్యావాః-జనాన్ + శ్యావాః = స్తోశ్చునాశ్చుః అను (8-4-40) పాణిని సూత్రముచేత నకారస్థానములో ఞకారము, శకారస్థానములో ఛకారము శ్చుత్వసంధివలన వచ్చినవి. వైదిక-భాషలో ఒకటి లేక రెండు హల్వర్ణములు మార్పుచెందుటను వశంగమ మందురు, శితిఽపాదః-శితయః శ్వేతవర్ణాః పాదాయేషాంతే శితిపాదాః అని విగ్రహము. సుపాంసులుక్ (7-1-39) అను పాణినిసూత్రముచేత జస్ ప్రత్యయమునకు సు అను ఆదేశమువచ్చును. దైవ్యస్య = ఇది సవితుః అను పదమునకు విశేషణము. "దేవాద్యఞఞౌ" అను (4-1-85,3) పాణిని సూత్రముచేత దేవశబ్దమునకు ప్రాగ్దీవ్యతీయయఞ్ ప్రత్యయము వచ్చి ఆదివృద్ధివలన రూపమేర్పడును.

స్వ॥ వి॥ : శితిఽపాదః = బహువ్రీహిసమాసమునందు శితి అనునది పూర్వపదముగా నున్నపుడు శితేర్నిత్యాఽబహ్వజ్ బహు-వ్రీహావభసత్ (6-2-138) అను పాణినిసూత్రముచేత ఉత్తరపదము ప్రకృతిస్వరమును ఆద్యుదాత్తమునుపొందును. హిరణ్యప్రఉగమ్= అశ్వములను రథమునకు కట్టు ప్రదేశము బంగారుమయము. ఇది బహువ్రీహిసమాసము కావున దీనికి పూర్వపదప్రకృతి స్వరము (ఆద్యుదాత్తము) వచ్చినది. దైవ్యస్య=ఞ్ నిత్యాదిర్నిత్యమ్" అను

(6-1-197) పాణిని సూత్రముచేత ఞిత్, నిత్ ప్రత్యయములతో అంతమగు పదముల మొదటి అక్షరమునకు ఉదాత్తము వచ్చినది.

సం॥పా॥ 6) తిస్రోద్యావః సవితుర్ద్వా ఉపస్థా
ఏకాయమస్య భువనేవిరాషాట్।
ఆణిం నరథ్యమమృతాధిత స్థురిహ
బ్రవీతు య ఉతచ్చికేతత్॥

ప॥పా॥ తిస్రః। ద్యావః। సవితుః। ద్వా। ఉపఽస్థా। ఏకా। యమస్య। భువనే।
విరాషాట్। ఆణిం। న। రథ్యమ్। అమృతా। అధి। తస్థుః।
ఇహ। బ్రవీతు। యః। ఊఇతి। తత్। చికేతత్॥

సా॥ భా॥ ద్యావః - స్వర్గోపలక్షితాః ప్రకాశమానాః లోకాః, తిస్రః-త్రిసంఖ్యాకాఃసన్తి.తత్రద్వా-లౌకౌ సవితుః-సూర్యస్య,ఉపస్థా-సమీపస్థానేవర్తేతే. ద్యులోకభూలోకయోః సూర్యేణప్రకాశితత్వాత్ ఏకా-మధ్యమాభూమిరన్తరిక్షలోకః, యమస్య భువనే-పితృపతేర్గృహే విరాషాట్-విరాన్గన్త్రాన్సహతే - ప్రేతాః పురుషాః అన్తరిక్షమార్గేణ యమలోకేగచ్ఛన్తీత్యర్థః, అమృతా - అమృతానిచంద్రనక్షత్రాదీని జ్యోతీంషి జలానివా, అధితస్థుః - సవితారమధిగమ్యస్థితాని, తత్ర దృష్టాన్తః-రథ్యం ఆణిం న, రథాత్ బహిః అక్షచ్ఛిద్రేప్రక్షిప్తః కీల విశేషః ఆణిరిత్యుచ్యతే। రథసంబంధినమ్ ఆణిం అధిగమ్య యథా-రథస్తిష్ఠతి తద్వత్. యఃతు మానవః తత్ సవితృరూపం చికేతత్-జానాతిస మానవః ఇహ అస్మిన్ విషయే. బ్రవీతు-కథయతున కేనాపి వక్తుమశక్యః, సవితుర్మహిమేత్యర్థః,

సా॥ భా॥ అను॥ ద్యావః = స్వర్గాన్ని ఉపలక్షణముగా కలిగి ప్రకాశించు లోకములు, తిస్రః = మూడుకలవు, ఇచ్చటద్వౌ = రెండు లోకములు, సవితుః=సూర్యునికి, ఉపస్థా = సమీపస్థానమందున్నవి. స్వర్గలోక భూలోకములు సూర్యునిచేత ప్రకాశింపబడుచున్నవి. ఏకా= మధ్యలోనున్న భూమి (అనగా ఆకాశము) యమస్యభువనే = యమ-ధర్మరాజుయొక్కనివాసమునందు,విరాషాట్=ఆమార్గముగుండా పయ-నించువారినిసహించును. (ప్రేతస్వరూపులగు పురుషులు ఆకాశమార్గము గుండా యమలోకమునకువెళ్ళుదురని అర్థము.) అమృతాః=మరణము లేని చంద్రనక్షత్రాదులు, ప్రకాశములు, జలములు, అధితస్థుః = సూర్యుని ఆశ్రయించి ఉన్నవి. రథ్యం అణిం న = రథమునకు వెలుపల అక్షచ్ఛిద్రములందు ఉన్న ఇరుసుని ఆణి అని అందురు. రథము ఇరుసును (ఆణిని) అనుసరించి ఎట్లుండునో అట్లు, యః = ఏ మానవుడు తత్ = ఆ సవితృరూపమును, చికేతత్ = తెలుసుకొనునో ఆ మానవుడు, ఇహ = ఈ విషయమునందు, బ్రవీతు = చెప్పుగాక! ఎవరిచేత వర్ణించుటకు అశక్యమైనది సూర్యమహిమ అని అర్థము.

వ్యా॥ వి॥ : ఉపస్థా = దగ్గర [Wilson] సమీపమునందలి [Griffith] ఒడి [Macdonell]. ఇచ్చట Macdonell అభిప్రాయము ప్రకారము ఉపస్థా అనునది ప్రథమాద్వివచనము, ఆకారాంత-రూపము, ఇటువంటి ప్రయోగములు వేదములలో అచ్చటచ్చట వచ్చుచుండును. కానీ సాయణాచార్యులు దీనిని సప్తమ్యర్థములో గ్రహించిరి. ద్యౌ + ఉపస్థా = ద్యాఉపస్థా=సంహితలో ఔకారమునకు ఆవాదేశమువచ్చి "లోపశ్శాకల్యస్య" (8-3-19)అను పాణినిసూత్రము చేత వకారలోపము వచ్చును. ఈ సంధిని వైదికభాషలో పదవృత్తి

అందురు. విరాషాట్ = ఇచ్చట Griffith అభిప్రాయము ప్రకారము విరాషాట్అనగా వీరులగృహమని అర్థము. Macdonell అభిప్రాయము ప్రకారము మానవుల నతిక్రమించువాడని అర్థము. విరాషాట్ అను-నది విరాసహ్ శబ్దమునకు ప్రథమైకవచనము. వీర అనుపదమే "విరా"గా ఛందోసౌలభ్యముకొరకు మార్పుచెందినది. పదపాఠము నందు "విరాషాట్" అనునది విభాగముచేయబడలేదు. విరా అనునది స్వతంత్ర పదముగా ప్రయోగించబడలేదు.

స్వ॥ వి॥ చికేతత్ - కితజ్ఞానే అనుధాతువునకు లేట్ లకారము-నందు ప్రథమపురుషైకవచనము, యచ్ఛబ్దము ముందుకలదు కాన ఉదాత్తస్వరము ఏర్పడెను.

సం॥ పా॥ 7) విసువర్ణో అన్తరిక్షాణ్యఖ్యత్
గభీరవేపా అసురః సునీథః।
క్వేదానీం సూర్యః కశ్చికేత
కతమాంద్యాం రశ్మిరస్యాతతాన॥

ప॥ పా॥ వి। సుఽపర్ణః। అన్తరిక్షాణి। అఖ్యత్। గభీరఽవేపాః। అసురః।సుఽనీథః। క్వ। ఇదానీమ్। సూర్యః। కః। చికేత। కతమామ్। ద్యామ్। రశ్మిః। అస్య। ఆ। తతాన॥

సా॥ భా॥ సుపర్ణః-శోభనపతనః సూర్యస్యరశ్మిః, అన్తరిక్షాణి-అన్తరిక్షోపలక్షితాని లోకత్రయస్థానాని, విఅఖ్యత్-విశేషేణ ప్రకాశిత-వాన్. కీదృశోరశ్మిః గభీరవేపాః-గంభీరకంపనః, రశ్మేః ప్రకమ్పనం చలనంకేనాపి ద్రష్టుమశక్యమిత్యర్థః, అసురః-సర్వేషాం ప్రాణదః,

సునీథః-సునయనః శోభనప్రాపణః, మార్గప్రకాశనేన అభీష్టదేశం ప్రాపయతీత్యర్థః. తాదృశరశ్మియుక్తః సూర్యః ఇదానీంరాత్రౌక్వ కుత్రవర్తతే, తదేతద్రహస్యం కశ్చికేత-కోజానాతి, నకోఽపీత్యర్థః। అస్యసూర్యరశ్మిః కతమాంద్యాం ఆతతాన-కంద్యులోకంరాత్రౌవ్యాప్తవాన్, ఏతదపికోజానాతి.

సా॥ భా॥ అను॥ సుపర్ణః = శుభకరమగు సూర్యరశ్మి, అన్తరిక్షాణి = ఆకాశము మొదలగు ముల్లోకములను (పృథివీ, ఆకాశము, స్వర్గము) విఅఖ్యత్ = విశేషముగా ప్రకాశింపచేసెను. ఎటువంటి రశ్మి? గభీరవేపాః = గంభీరమైన కదలికగలది (సూర్యరశ్మియొక్క చలనము ఎవరిచేతకూడా చూచుటకుశక్యముకాదు.) అసురః=అందరికి ప్రాణములొసంగునది, సునీథః = చక్కగా నడిపించునది, మార్గమును ప్రకాశింపచేయుటద్వారా ఇష్టమగు ప్రదేశమునకు చేరునట్లు చేయును. అటువంటి కిరణములతోకూడిన సూర్యుడు, ఇదానీం = రాత్రులందు, క్వ = ఎచ్చట ఉన్నాడు? ఈ రహస్యమును కశ్చికేత= ఎవరు తెలుసుకొనగలరు? ఎవరూ తెలుసుకొనలేరు. అస్య=సూర్యునియొక్క, రశ్మిః = వెలుగు, కతమాంద్యాం ఆతతాన = ఏ స్వర్గలోకమును రాత్రియందు వ్యాపించెనో ఈ విషయమునుకూడా ఎవరు తెలుసుకొనగల్గుచున్నారు.

వ్యా వి॥ సుపర్ణః = రశ్మినామములలో సుపర్ణః అనునదికూడా కలదు, (నిఘంటు I-5-15) సాయణాభిప్రాయము-సుపర్ణః అనగా శుభప్రదమగు సూర్యరశ్మి, Griffith సూర్యుడు, Macdonell = పక్షి (సూర్యుడు) అను అర్థములను వివరించిరి. గభీరఽవేపాః = గడగడ వణుకుట [Sayana, Wilson, Griffith] దివ్యజ్ఞానము [Macdonell]

టువే[ప్రకంపనే అనుదాతువునకు అసున్ ప్రత్యయము చేయగా "వేపా" అనురూపము సిద్ధించును. అసురః = అసుక్షేపణే అను ధాతువునకు "అసేరురన్" (1-42) అను ఉణాది సూత్రముచే ఉరన్ ప్రత్యయము విధించగా ఏర్పడెను. అన్యతిశ్రమానిత్యసురఃలేక అసూన్ = ప్రాణములను, రాతి=ఇచ్చుచున్నాడు-అనువ్యుత్పత్తికిక ప్రత్యయము చేయగా రూపము ఏర్పడెను. సునీథః = చక్కగా మార్గము చూపువాడు [Wilson] గొప్ప నాయకుడు [Griffith] చక్కగానడిపించువాడు [Macdonell] అను అభిప్రాయములను వ్యక్తపరచిరి.

స్వ॥ వి॥ సుపర్ణః = ఇది బహువ్రీహిసమాసము, కావున "నఞ్ సుభ్యామ్" అను (6-2-172) పాణినిసూత్రముచే ఉత్తరపదములోని రెండవ అక్షరమునకు ఉదాత్తము వచ్చెను. గభీరవేపాః = ఇచ్చట పూర్వపద ప్రకృతిస్వరము (ఉదాత్తము)ఏర్పడెను. అసురః=ఇచ్చట విదించబడిన ఉరన్ ప్రత్యయము నిత్వముగాన ఆద్యుదాత్తము వచ్చెను.సునీథః=ఇచ్చట థమొదలగు ప్రత్యయములతో అంతమగు పదములు సమాసములో ఉత్తరపదముగా ఉండి "థాథఘఞ్ క్తాజ బిత్రకాణామ్" (6 2-144) అను పాణిని సూత్రముచే ఉదాత్తమును పొందును.

సం॥పా॥ 8) అష్టౌ వ్యఖ్యత్కకుభః పృథివ్యా
త్రీ ధన్వయోజనాసప్తసిన్ధూన్।
హిరణ్యాక్షః సవితాదేవ ఆగా
ద్దధద్రత్నా దాశుషే వార్యాణి॥

ప॥పా॥ అష్టౌ। వి। అఖ్యత్। కకుభః। పృథివ్యాః। త్రి। ధన్వ। యోజనా।

సప్త। సిన్ధూన్। హిరణ్యఽఅక్షః సవితా। దేవః। ఆ।అగాత్।
దధత్। రత్నా। దాశుషే। వార్యాణి॥

సా॥ భా॥ : పృథివ్యాః సంబన్ధినీః అష్టౌకకుభః-ప్రాచ్యాద్యాశ్చ తస్రోదిశ ఆగ్నేయాద్యాశ్చతస్రోవిదిశ ఇత్యేవమష్టౌదిశః, వ్యఖ్యత్-సవితా ప్రకాశితవాన్-తథాయోజనా- ప్రాణినః స్వస్వభోగేనయోజయితౄన్, ధన్వ-అన్తరిక్షోపలక్షితాన్, త్రీ-త్రిసంఖ్యాకాన్ పృథివ్యాది లోకాన్, సప్తసింధూన్-గంగాదినదీః సముద్రాన్వా సవితా వ్యఖ్యత్. హిరణ్యాక్షః-హితరమణీయ చక్షుర్యుక్తః, హిరణ్యమయాక్షోవాసవితా-దేవః, ఆగాత్-ఇహాగచ్ఛతు. కిం కుర్వన్ - దాశుషే - హవిర్దత్తవతే యజమానా య, వార్యాణి-వరణీయానిరత్నాని, దధత్- ప్రయచ్ఛన్.

సా॥ భా॥ అను॥ : పృథివ్యాః = భూమికి సంబంధించిన, అష్టౌ-కకుభః = ప్రాచీ మొదలగు నాలుగుదిక్కులు + ఆగ్నేయాది నాలుగు విదిక్కులు,మొత్తము ఎనిమిదిదిక్కులను,(సవితా)వ్యఖ్యత్=సూర్యుడు ప్రకాశింపచేసెను, యోజనా = ఆయా భోగములతోకూడిన ప్రాణులను, ధన్వ = ఆకాశము మొదలగు, త్రీ = పృథివ్యాది ముల్లోకములను, సప్తసింధూన్ = గంగాది నదులను లేక సముద్రాలను సవిత ప్రకాశింపచేసెను. హిరణ్యాక్షః = సువర్ణమువంటి నేత్రములుకలిగిన సవితాదేవః=సూర్యదేవుడు,ఆగాత్=ఇచ్చటికివచ్చుగాక!ఏమిచేయుచూ దాశుషే = హవిస్సులను సమర్పించిన యజమానికొరకు, వార్యాణి = వరించదగిన రత్నములను, దధత్=ఇచ్చుచూ (ఇచ్చటికివచ్చుగాక.)

వ్యా॥ వి॥ : యోజనా = యోజనా శబ్దమునకు ద్వితీయాబహువచనము. సాయణాచార్యులు యోజనా అను శబ్దమునకు ప్రాణులు అని అర్థము చెప్పిరి. Macdonell యోజన అనగా "ముప్పది"సంఖ్య

అని ఊహించెను. ఈ అభిప్రాయము (I-123-8) అను సంఖ్యగల ఋక్కునందు వ్యక్తము చేయబడెను. అగాత్ = ఇణ్ గతౌ అనుధాతువునకు లుఙ్ లకారము ప్రథమపురుషైకవచనము. దధత్ = ధారణార్థక ధాధాతువునకు శతృ ప్రత్యయమువలన ఏర్పడిన వర్తమానకాలికరూపము. దాశుషే = పూజార్థక దాశ్ధాతువునకు క్వసు ప్రత్యయము. చతుర్థీవిభక్తిలో సంప్రసారణము షత్వము చేయగా రూపము ఏర్పడెను. వార్యాణి = వృఞ్ వరణే ధాతువునకు ణ్యత్ ప్రత్యయమువలన రూపమేర్పడినది.

స్వ॥ వి॥ దధత్=ఇచ్చట "అభ్యస్తానామాదిః" అను (6-1-189) పాణిని సూత్రముచే ఆద్యుదాత్తము ఏర్పడెను. అట్లె వార్యాణి = ఈడవన్దవృశంసదుహాంణ్యతః (6-1-214) అను పాణిని సూత్రముచే ఆద్యుదాత్తము సిద్ధించినది.

సం॥ పా॥ 9) హిరణ్యపాణిః సవితా విచర్షణి
రుభేద్యావా పృథివీ అన్తరీయతే।
అపామీవాంబాధతే వేతి సూర్య
మభికృష్ణేన రజసాద్యామృణోతి॥

ప॥పా॥ హిరణ్యపాణిః। సవితా। వి౽చర్షణిః। ఉభే ఇతి। ద్యావా।
పృథివీ ఇతి। అన్తః। ఈయతే। అప। అమీవాం। బాధతే।
వేతి। సూర్యమ్। అభి కృష్ణేన। రజసా। ద్యామ్, ఋణోతి।

సా॥ భా॥ హిరణ్యపాణిః-సువర్ణమయ హస్తయుక్తః, యద్వా యజమానేభ్యోదాతుం-హిరణ్యంహస్తే ధృతవాన్,విచర్షణిః-వివిధదర్శనయుక్తః, సవితా-దేవః, ఉభే-ద్యావా పృథివీ, అన్తః-ఉభయోర్లోకయోర్మధ్యే, ఈయతే-గచ్ఛతి, అమీవాం-రోగాదిబాధామ్, అపబాధతే-

సమ్యక్‌నిరాకరోతి. తథా సూర్యం చేతి గచ్ఛతి. యద్యపిసవితృ సూర్యయోరేకదేవతాత్వం తథాపిమూర్తిభేదేనగంతృగం తవ్యభావః-కృష్ణేన-తమసః నివర్తకేన, రజసా-తేజసా, ద్యామ్ ఆకాశమ్, అభి ఋణోతి సర్వతోవ్యాప్నోతి.

సా॥ భా॥ అను॥ హిరణ్యపాణిః = సువర్ణమయమగు హస్తములో కూడిన వాడు లేక యజమానులకు ఇచ్చుటకు సువర్ణమును హస్తము నందు ధరించినవాడు, విచర్షణిః = అనేకవిధముల దృష్టులను కలిగిన వాడు, సవితా = సవితృదేవుడు, ఉభేద్యావా పృథివీ=స్వర్గభూలోకము లకు, అన్తః = మధ్యలో ఆకాశమునందు, ఈయతే = వెళ్ళుచున్నాడు, అమీవాం = రోగాదిబాధలను, అపబాధతే=చక్కగా పోగొట్టుచున్నాడు, అట్లే సూర్యునివద్దకు వెళ్ళుచున్నాడు. సవితృ సూర్యులలో బేదము లేకపోయినప్పటికీ మూర్తిభేదమువలన గన్తృగంతవ్యభావమేర్పడెను (ఒకరు వెళ్ళువారు, మరొకరిది వెళ్ళవలసిన ప్రదేశము) కృష్ణేన = చీకటిని పారద్రోలు రజసా = ప్రకాశముతో, ద్యామ్ = ఆకాశమును అభిఋణోతి = అంతా వ్యాపించుచున్నాడు.

వ్యా॥ వి॥ హిరణ్యఽపాణిః = బహువ్రీహిసమాసము, ఉభే = ద్వివచనము గనుక ప్రగృహ్య సంజ్ఞను పొందినది, అందువలన పద పాఠములో "ఉభేఇతి" అని ఏర్పడెను. ద్యావా పృథివీ ఇతి = ఓప్ శబ్దముయొక్కస్థానమునందు "ద్యావా" అను ఆదేశము పృథివీ అను పదముతో ద్వంద్వ సమాసమేర్పడినపుడు "దివసశ్చపృథివ్యామ్" (6-3-30) అను పాణిని సూత్రముచే వచ్చినది. "ద్యావా పృథివీ" అనునది ఈకారాంతము కావున ప్రగృహ్యసంజ్ఞనుపొంది, "ఇతి" అను దానితో పదపాఠము పఠింపబడినది. బాధతే = అడ్డగించుట అను

అర్థముగల ఆత్మనే పదధాతువునకు వర్తమానకాలిక ప్రథమపురుషైక-వచనము. వేతి = "వీగతిప్రజనకాన్త్యశనఖాదనేషు" అనుధాతువు-నకు లట్ ప్రథమపురుషైకవచనము. అభిఋణోతి = అభి అను ఉప-సర్గపూర్వకముగా ఋణుగతౌ అనుధాతువునకు వర్తమానకాలిక ప్రథమ పురుషైకవచనము.

స్వ॥ వి॥ హిరణ్యఽపాణిః = బహువ్రీహిసమాసమైనందువలన పూర్వపదములోని మొదటిఅక్షరమునకు ఉదాత్తము వచ్చెను. ద్యావా పృథివీఇతి = దేవతా ద్వన్ద్వేచ (6-3-26) అను పాణిని సూత్రముచే ఉభయపద ప్రకృతిస్వరము (ఉదాత్తము) ఏర్పడినది. బాధతే - వేతి, ఈ రెండింటిమధ్యలో చకారములేదు గనుక ఆద్యుదాత్తము వచ్చెను. వేతి = కొత్తవాక్యమును ప్రారంభించును గనుక ఉదాత్త-మును పొందెను.

సం॥పా॥ 10) హిరణ్యహస్తో అసురః సునీథః
సుమృళీకః స్వవాయాత్వర్వాజ్।
అపసే ధన్రక్షసోయాతుధానా
నస్థాద్దేవః ప్రతిదోషం గృణానః॥

పద॥పా॥ హిరణ్యఽహస్తః। అసురః। సుఽనీథః। సుఽమృళీకః। స్వఽవాన్। యాతు। అర్వాజ్। అపఽసేధన్। రక్షసః। యాతుఽధానాన్। అస్థాత్। దేవః। ప్రతిఽదోషం। గృణానః॥

సా॥భా॥ హిరణ్యహస్తః అసురః ప్రాణదాతా, సునీథః-సుష్ఠు నేతా ప్రశస్య ఇత్యర్థః, సుమృళీకః-సుష్ఠుసుఖయితా, స్వవాన్-ధన-వాన్, అర్వాజ్-అభిముఖః కర్మదేశే గచ్ఛతు. కించాయం దేవః, ప్రతి

దోషం-ప్రతిరాత్రి, గృణానః-స్తూయమానః, అస్థాత్-స్థితవాన్, కిం కుర్వన్, రక్షసః-బాధకత్వేన రక్షణ నిమిత్తభూతాన్, యాతుధానాన్-అసురాన్, అపసేధన్-నిరాకుర్వన్.

సా॥భా॥అను॥ హిరణ్యహస్తః = సువర్ణమును హస్తమునందు గలవాడు, అసురః = ప్రాణములను ఇచ్చువాడు, సునీథః=చక్కగా మార్గమును చూపించువాడు, సుమృళీకః = చక్కగా సుఖమునుకలుగ చేయువాడు, స్వవాన్ = ధనవంతుడు, అర్వాఙ్ = అభిముఖుడై కర్మ చేయు ప్రదేశమునకు వచ్చుగాక! ఇంకనూ ఈదేవుడు, ప్రతిదోషం= ప్రతిరాత్రి, గృణానః = స్తుతించబడుతూ, అస్థాత్ = ఉండెను. ఏమి చేయుచూ? రక్షసః = బాధకులగు రాక్షసులను, యాతుధానాన్ = మాయావులగు అసురులను, అపసేధన్ = దూరముగా తరిమికొట్టుచూ (ఉండెను.)

వ్యా॥ వి॥ స్వవాన్ = Roth అభిమతము ప్రకారము స్వవస్ శబ్దమునకు ప్రథమైకవచనరూపము,ముందు అచ్చు ఉండి అకారముతో అనుసరించబడినది గనుక "న్" అనునది లోపించెను స్వవాన్‌లోని వకారముతోనున్న అకారము అనునాసికమును పొందెను. స్వవాన్ అనుపదములోని చివరి "న్" వర్ణము లోపించును. వకారములోని అకారము అనునాసికమగును. పూర్వము అజ్ వర్ణము లేకపోయిననూ ఇది అన్‌పద పదవృత్తియొక్క విశేషము. ఋగ్వేద ప్రాతిశాఖ్యనందు (4-68) ఈ విషయము వివరించబడెను. ప్రతి౽దోషమ్- Macdonell ఈపదమును అస్థాత్ అను క్రియాపదముతో అన్వయించెను. సాయణ Wilson మరియూ Griffith పండితులు ప్రతిదోషం అనునది కాల-వాచకపదమునకు క్రియావిశేషణముగా వివరించిరి మరియూ గృణా-

నః అనుదానితో అన్వయించిరి. గృణానః = గౄశబ్దే అనుధాతుపునకు వర్తమాన కాలికశానచ్ ప్రత్యయాంతరూపము.

స్వ॥వి॥ సుఽమృళీకః = మంచిసుఖమును కలుగచేయువాడు బహుప్రీహిసమాసము, కావున-"నఞ్‌సుభ్యామ్" అను (6-2-172) పాణినిసూత్రముచే ఉత్తరపదాంతోదాత్తముఏర్పడెను. అపఽసేధన్= షిధుగత్యాం అనుధాతువునకు వర్తమానకాలికరూపము. అప అను ఉపసర్గతో సమాసము వచ్చినది, ఉదాత్తస్వరము రాలేదు. పద పాఠములో అవగ్రహముద్వారా వేరుచేయబడినది. ప్రతిఽదోషమ్ = ఇది అవ్యయీభావసమాసము కాన ఉత్తరపదములోని చివరిఅక్షరము నకు ఉదాత్తము వచ్చెను.

సం॥పా॥ 11) యే తే పన్థాః సవితః పూర్వ్యాసో
ఽరేణవః సుకృతా అన్తరిక్షే।
తేభిర్నో అద్యపథిభిః సుగేభి
రక్షాచనో అధిచ బ్రూహిదేవ॥

పద॥పా॥ యే। తే। పన్థాః। సవితరితి। పూర్వ్యాసః। అరేణవః। సుఽకృతాః। అన్తరిక్షే। తేభిః। నః। అద్య। పథిఽభిః। సుఽగేభిః। రక్ష। చ। నః। అధి। చ। బ్రూహి। దేవ॥

సా॥ భా॥ హే సవితః, తే-తవ, పన్థాః-మార్గాః, పూర్వ్యాసః - పూర్వసిద్ధాః, అరేణవః-ధూళిరహితాః, అన్తరిక్షేసుకృతాః-సుష్ఠుసంపాదితాః, సుగేభిః - సుష్ఠుగంతుంశక్యైః తేభిః పథిభిః-తైర్మార్గైరాగత్య అద్య-అస్మిన్‌దినే, నః-అస్మాన్, రక్షచ-పాలనమపికురు తథాహేదేవ

నః-అస్మాన్ అనుష్ఠాతౄన్ అధి బ్రూహిచ - దేవానామగ్రే అదికర్త్వేన కథయ.

సా॥బా॥అను॥ హే సవితః = ఓ సవితృదేవ! తే = నీయొక్క, పన్థాః = మార్గములు, పూర్వ్యాసః=పూర్వము సిద్ధించినవి, అరేణవః = ధూళిలేనటువంటివి, అన్తరిక్షే సుకృతాః = ఆకాశమునందు చక్కగా, సంపాదించబడినవి, సుగేభిః = చక్కగా ప్రయాణించుటకు వీలుపడు, తేభిః పథిభిః = ఆయా మార్గములగుండా వచ్చి, అద్య = ఈ రోజు, నః = నమ్ములను, రక్షచ = పాలించుము. అట్లే ఓ దేవ! నః = నిన్ను స్తోత్రము చేయు మాగురించి, అధిబ్రూహి = దేవతలవద్ద గొన్పగా చెప్పుము.

వ్యా॥వి॥ పూర్వ్యాసః-పూర్వే అను ప్రకృతికి య ప్రత్యయము వచ్చి పూర్వ్య అని ఏర్పడి అసన్ ప్రత్యయముకలువగారూపముఏర్పడెను. సుఽకృతాః = సు అను ఈపసర్గ ఏవిధమైన అడ్డగింపులేకుండా క్త-ప్రత్యయముతో అంతమగుపదముతో కర్మార్థమునందు సమాసమును పొందెను. సుగేభీ-సుగేభిః అనుపదములోని ఆఖరి అచ్చు (హ్రస్వే-కారము) రేఫమును పొందెను. విసర్గలను పొందవలసిన ఇకారము దీర్ఘమును పొందెను రేఫము ప్రక్కన ఉంది గనుక, రక్షా = సంహితలో రెండవ అక్షరమునకు ధీర్ఘము వచ్చెను. ద్వ్యచోఽత స్తిఙః" (6-3-135) అను పాణినిసూత్రముచే. రక్షణార్థకరక్షధాతువు-నకు లోట్ మధ్యమపురుషైకవచనము.

స్వ॥వి॥ పన్థాః-మార్గములు, సర్వనామ శబ్దమగు "పథిన్" యొక్క జస్ ప్రత్యయస్థానములోసుపాంసులు క్ అనుసూత్రముచే సు ప్రత్యయము విధించబడును. "పథిమథోః సర్వనామస్థానే"

(6-1-19) అనుపాణినిసూత్రముచే అద్యుదాత్తము వచ్చినది. సవితః = సంబోధన ప్రథమా, పాదప్రారంభములోలేదు గనుక-ఉదాత్తస్వరమును పొందెను, విసర్గలకు రేఫము వచ్చెను, అందువలన పదపాఠములో ఇతి అనునది ఏర్పడినది. (సవితరితి) అరేణవః = బహువ్రీహిసమాసము. "నఞ్సుభ్యామ్" (6-2-172) అను పాణినిసూత్రముచే ఉత్తరపదములోని అక్షరమునకు ఉదాత్తము వచ్చెను. సుఽకృతాః = సు అను ఉపసర్గ ఏవిధమైన అడ్డగింపులేకుండా క్త ప్రత్యయముతో అంతమగు పదముతో కర్మార్థమునందు సమాసము వచ్చి క్త అనునది గతిరనన్తరః (6-2-49) అను పాణినిసూత్రముచే ఉదాత్తమును పొందినది. సుఽగేభిః = ఇది బహువ్రీహిసమాసము కావున ఉత్తరపదమునకు ఉదాత్తము వచ్చెను.

-o-

## 3. మరుత్సూక్తము

సం॥పా॥ ప్రయే శుంభంతే జనయోన సప్తయోయా
మన్రుద్రస్య సూనవః సుదంససః॥
రోదసీ హి మరుతశ్చక్రిరే వృధే
మదంతి వీరా విదథేషు ఘృష్వయః॥

ప॥పా॥ ప్ర। యే। శుంభంతే।జనయః।న।సప్తయః।యామన్।
రుద్రస్య। సూనవః। సుఽదంససః। రోదసీ ఇతి। హి।
మరుతః। చక్రిరే। వృధే। మదంతి। వీరాః। విదథేషు।
ఘృష్వయః॥

సా॥భా॥ యే మరుతో యామన్-యామని గమనేనిమిత్తభూతే సతి. ప్రశుంభంతే-ప్రకర్షేణస్వకీయాన్యంగాన్యలంకుర్వన్తి, జనయోన జాయాఇవ. యథాయోషితః స్వకీయాన్యంగాన్యలంకుర్వన్తి తద్వత్- కీదృశామరుతఃసప్తయః-సర్పణశీలాః, రుద్రస్యసూనవః, సుదంససః- శోభన కర్మాణః, హి-యస్మాత్, మరుతః, రోదసే-ద్యావాపృథివ్యౌ, వృధే - వృష్టిప్రదానాదినావర్ధనాయ, చక్రిరే-కృతవంతః. వీరాః - విశేషేణశత్రుక్షేపణశీలాః, ఘృష్వయః-ఘర్షణశీలాః,మహీరుహశిలోచ్ఛ యాదేర్భంజకా ఇత్యర్థః, ఏవభూతాస్తే మరుతః, విదదేషు - యజ్ఞేషు, మదంతి-సోమపానేన హృష్యంతి॥

సా॥భా॥అను॥ యే = మరుత్ దేవతలు, యామన్=గమనమును నిమిత్తముగా చేసుకొని, ప్రశుంభంతే = తమయొక్క అంగములను చక్కగా అలంకరించుకొనుచున్నారు,జనయోన = భార్యలవలె (ఎట్లైతే స్త్రీలు తమ అవయవములను చక్కగా అలంకరించుకొనెదరో అట్లు)

ఎటువంటి మరుత్తులు? సప్తయః = సంచరించు స్వభావము కలవారు. రుద్రస్యసూనవః = పరమేశ్వరుని పుత్రులు, సుదంససః = శోభన కర్మలనాచరించువారు, హి = ఎందువలననగా (మరుత్తులు) రోదసీ = భూమ్యాకాశములను, వృధే = వర్షమును కురిపించుటద్వారా వృద్ధిని, చక్రిరే = చేసిరి, వీరాః = విశేషముగా శత్రువులను కంపింపచేయు-వారు, ఋష్వయః = ఘర్షణశీలురు (పర్వతములను, శిలలను పిండి చేయువారు అని అర్థము) ఇటువంటి మరుత్తులు, విదథేషు = యజ్ఞము లందు, మదంతి = సోమపానముద్వారా తృప్తిని పొందుచున్నారు.

వ్యా॥వి॥ శుంభంతే = శుభశుంభదీప్తౌ అను ఆత్మనేపద ధాతువు నకు లట్ ప్రథమపురుష బహువచనము, జనయః = జాయంతే అస్వ పత్యానీతి జనయః (జాయాః) అని వ్యుత్పత్తి. "ఇన్ సార్వధాతుభ్యః అను సూత్రముచే ఇన్ ప్రత్యయము వచ్చెను. యామన్=(యామని) యాప్రాపణే ధాతువు, "కృత్యల్యుటో బహులం" (3-3-113) అను సూత్రమునందు బహులవచనమువలన"ఆతోమనిన్"అనుసూత్రముచే (3-2-74) భావార్థమునందు మనిన్ విధించబడెను. "సుపాంసులుక్" (7-1-39) అనుసూత్రముచే సప్తమీవిభక్తికి లోపము వచ్చెను. సుఽ-దంససః = దంసః అనునది కర్మనామము శోభనం దంసోయేషాం అని విగ్రహము. వృధే = వృధువృద్ధౌ అనుదాతువునకు "సంపదా-దిభ్యఃక్విప్" అనువార్తికముచేత(2233)భావార్థమునందు క్విప్ ప్రత్య-యము విధించబడెను. విదథేషు = విదజ్ఞానే అను ధాతువునకు రుది-విదిభ్యాంకిత్" అను ఉణాది సూత్రముచే (3-395) అథప్రత్యయము చేయుగా విదథః అగును. ఋష్వయః = ఋషుసంఘర్షే అనుధాతువు నకు "కృవిఘృష్వేత్యాది" ఉణాది సూత్రముచేత (4-495) విన్ ప్రత్యయాంతము నిపాత చేయబడుచున్నది.

స్వ॥ వి॥ సుఽదంసనః ఇచ్చట "నోర్మనసీ అలోమోషసీ"అను సూత్రముచేత (6-2-117) ఉత్తరపదాద్యుదాత్త మేర్పడెను. వృదే= ఇచ్చట విధించబడిన క్విప్ సర్వలోపిసావేకాచ" అనుసూత్రముచే (6-1-168) విభక్తికి ఉదాత్తము వచ్చెను. (వృధే-వర్ధనాయ)

సం॥పా॥ 2) త ఉక్షితాసో మహిమా నమాశతదివిరుద్రాసో
అధిచక్రిరేసదః। అర్చంతో అర్కంజనయన్త
ఇంద్రియ మధిశ్రియోదధిరే పృశ్నిమాతరః॥

పద॥ పా॥ తే। ఉక్షితాసః। మహిమానం। ఆశత। దివి।
రుద్రాసః। అధి। చక్రిరే। సదః। అర్చంతః।
అర్కం।జనయంతః। ఇంద్రియం। అధి। శ్రియః।
దధిరే। పృశ్నిఽమాతరః॥

సా॥బా॥ యే పూర్వోక్తగుణవిశిష్టాః తేమరుతః, ఉక్షితాసః-దేవైరభిషిక్తాస్సంతో, మహిమానం - మహత్త్వ, మాశత-అప్నువన్. రుద్రాసః-రుద్రస్యపుత్రాః తేరుద్రపుత్రామరుతో, దివి-ద్యోతమానేన భసి, సదః-సదనం స్థానం, అధిచక్రిరే - అధికం సర్వోత్కృష్టం కృతవంతః, అర్కం-అర్చనీయమింద్రం, అర్చంతః-పూజయంతః, ఇంద్రియం - ఇంద్రస్యలింగంవీర్యం జనయంతః-ఉత్పాదయంతః, పృశ్నిమాతరః-పృశ్నేర్నానారూపాయా భూమేః పుత్రామరుతః, శ్రియః-ఐశ్వర్యస్యాధిదధిరే-ఆధిక్యేనాధారయన్.

పా॥భా॥అను॥ పూర్వోక్తగుణములతోకూడిన, తే = అమరుత్తులు ఉక్షితాసః = దేవతలచేత అభిషేకించబడినవారై, మహిమానం=గొప్ప తనమును, ఆశత = పొందిరి, రుద్రాసః = రుద్రునిపుత్రులగు, తే=

ఆమరుత్తులు, దివి = ప్రకాశించు ఆకాశమునందు, సదః-స్థానమును, అధిచక్రిరే = అధికముగా, గొప్పగా ఏర్పరచుకొనిరి. అర్కం = పూజనీయుడగు ఇంద్రుని, అర్చంతః = పూజించుచూ, ఇంద్రియం= వీర్యమును, జనయంతః = ఉత్పాదనచేయుచూ, పృశ్ని మాతరః = బహురూపములుగా నున్న భూమి పుత్రులు మరుత్తులు శ్రియః = ఐశ్వర్యమును, అధిదధిరే = అదికముగా ధరించిరి.

వ్యా॥ వి॥ ఉక్షితాసః = ఉక్షసేచనే అనుదాతువునకు కర్మణి (నిష్ఠా) క్త ప్రత్యయము."ఆజ్జసేరసుక్" అనుసూత్రముచే (7-1-50) అసుక్ ప్రత్యయం విధించబడగా రూపమేర్పడెను. మహిమానం = మహచ్ఛబ్దమునకు పృథ్వ్యాది లక్షణమగు ఇమనిచ్ ప్రత్యయము వచ్చెను. "టేః" అనుసూత్రముచే (6-4-143) టి లోపము చేయగా (మహ్ + ఇమన్) = మహిమన్ అని రూపముసిద్ధించెను. ఇంద్రియం "ఇంద్రియ మింద్రలింగమింద్రదృష్టం" అను (5-2-73) పాణిని సూత్రమునందు ఘఙ్ ప్రత్యయాంతముగా నిపాతన చేయబడెను. పృశ్ని మాతరః="ఇయంవై పృశ్నిః" (తై. బ్రా. 1-4-1-5) ఇత్యాది మంత్రములలో నిపాతనవలన రూపసిద్ధి. పృశ్నిః మాతాయేషాంతే పృశ్ని మాతరః అని విగ్రహము "ఋతశ్ఛందసి" అను (5-4 158) పాణినిసూత్రముచేత సమాసాంతకప్ ప్రత్యయనిషేధము.

సం॥పా॥ 3) గోమాతరో యచ్ఛుభయంతే అంజిభిస్తనూషు
శుభ్రాదధిరే విరుక్మతః।బాధంతే విశ్వమభిమాతి
నమపవర్త్మాన్యేషామనురీయ తేఘృతమ్॥

పద॥ పా॥ గోఽమాతరః। యత్। శుభయంతే। అంజిఽభిః।

తనూషు। శుభ్రాః దధిరే। విరుక్మతః। బాధంతే।
విశ్వం। అభిఽమాతినం। అప। వర్త్మాని। అను।
రీయతే। ఘృతమ్॥

సా॥భా॥ గోమాతరః-గోరూపా భూమిర్మాతా యేషాంతే మరుతః, అంజిభీరూపాభివ్యంజకై రాభరణై ర్యద్యదా శుభయంతే - స్వకీయాన్యంగాని శోభాయుక్తాని కుర్వంతి, తదానీం శుభ్రాదీప్తామరుతస్తనూషు స్వకీయేషు శరీరేషు, విరుక్మతః - విశేషేణరోచమానా - నలంకారాన్, దధిరే-ధారయంతి. అపిచ విశ్వం-సర్వం, అభిమాతినం-శత్రుం, అపబాధంతే-హింసంతి, ఏషాంమరుతాం, వర్త్మాని-మార్గాననుసృత్య, ఘృతం-క్షరణశీలముదకం, రీయతే - ప్రవతి, యత్ర మరుతోగచ్ఛంతి వృష్ట్యుదకమపి తదనుసారేణతత్రగచ్ఛతీత్యర్థః.

సా॥భా॥అను॥ గోమాతరః = గోరూపమగు భూమిని తల్లిగా గల మరుత్తులు, అంజిభీ = స్వరూపమును అభివ్యక్తము చేయు ఆభరణములతో, యత్ = ఎప్పుడు, శుభయంతే = తమ అవయవములను అందముగా అలంకరించుచున్నారో, అప్పుడు శుభ్రాః = ప్రకాశించు మరుత్తులు, తనూషు = తమ శరీరములందు, విరుక్మతః = విశేషముగా ఇష్టమగు అలంకారములను, దధిరే = ధరించుచున్నారు, ఇంకనూ, విశ్వం = లోకమంతా, అభిమాతినం = శత్రువును, అపబాధంతే = హింసించుచున్నారు. ఏషాం = ఈ మరుత్తులయొక్క, వర్త్మాని = మార్గములననుసరించి, ఘృతం = స్రవించు స్వభావముగల ఉదకము, రీయతే = స్రవించుచున్నది. ఎచ్చటకై తేమరుత్తులు వెళ్ళుచున్నారో వర్షజలముకూడా వారిననుసరించి అచ్చటికి వెళ్ళుచున్నది.

వ్యా॥ వి॥ శుభయంతే = సంజ్ఞా పూర్వకవిధి అనిత్యమగుట-వలన లఘూపధగుణమురాలేదు. అంజిభిః = అంజూవ్యక్తిమ్రక్షణ కాన్తిగతిషు అనుధాతువునకు "ఖనికషికస్యంజ్యసివని "ఇత్యాదిఉణాది (4–139) సూత్రముచే ఇప్రత్యయము విధించబడెను. శుభ్రాః = శుభదీప్తౌ అనుధాతువునకు "స్ఫాయితంచీ"త్యాది సూత్రముచే (2–170) రక్ ప్రత్యయము వచ్చెను, విరుక్మతః = విశిష్టారుక్విరుక్ తద్వంతో విరుక్మంతః" (విశేషముగా ప్రకాశించు అలంకారములను) మతుప్ ప్రత్యయము, అయస్మయాదిగణములో పఠించుటవలన పదత్వము సిద్ధించుటచేత కుత్వము ఏర్పడెను. ఛత్వమువలన జశ్త్వము రాలేదు.

సం॥పా॥ 4) వియే భ్రాజంతే సుమఖాసఋష్టిభిః
ప్రచ్యావయంతో అచ్యుతాచిదోజసా।
మనోజువో యన్మరుతో రథేష్వా
వృషవ్రాతాసః పృషతీరయుగ్ధ్వం॥

పద॥ పా॥ వి। యే। భ్రాజంతే। సుఽమఖాసః। ఋష్టిఽభిః।
ప్రఽచ్యావయంతః। అచ్యుతా। చిత్। ఓజసా।
మనఃఽజువః। యత్। మరుతః। రథేషు। ఆ।
వృషఽవ్రాతాసః। పృషతీః। అయుగ్ధ్వం॥

సా॥ భా॥ సుమఖాసః - శోభన యజ్ఞాయేమరుతః, ఋష్టిభిః ఆయుధైః, విభ్రాజంతే–విశేషేణదీప్యంతే, తేమరుతః, అచ్యుతా - చిత్–చ్యావయితుమశక్యాని దృఢాని పర్వతాదీన్యపి, ఓజసా- స్వకీయేనబలేన, ప్రచ్యావయంతః–ప్రకర్షేణ చ్యావయితారః ప్రేరయితారో భవంతి. హే మరుతః మనోజువః–మనోవద్వేగగతయః, వృషవ్రాతా

సః-వృష్ట్యుదకసేచన సమర్థ సప్తసంఘాత్మకాయూయం, రథేషు - ఆత్మీయేషు, పృషతీః-పృషద్భిః శ్వేతబిందుభిర్యుక్తా మృగీః, యదయ్యు-డాయుగ్ధ్వం-అభిముఖ్యేన నియుక్తా అకృధ్వం, తదానీంపర్వతాదికం ప్రచ్యవతా ఇత్యర్థః॥

సా॥బా॥అను॥ సుమఖాసః = మంచియజ్ఞములుగల, యే = ఏ మరుత్తులు, ఋష్టిభిః = ఆయుధములచేత, విభ్రాజంతే = విశేషముగా ప్రకాశించుచున్నారో, తే = ఆమరుత్తులు, అచ్యుతాచిత్ = ముక్కలు చేయుటకు అశక్యములు, దృఢమైన పర్వతాదులను, ఓజసా = తమ యొక్క బలముచేత, ప్రచ్యావయంతః=శక్తిచేత ముక్కలుగా వేయుచున్నారు. హే మరుత్వః = ఓ మరుద్దేవతలారా! మనోజువః=మనస్సువలె వేగగమనముగల, వృషవ్రాతాసః = వర్షజలముతో సేచనము (తడుపుట) చేయుటలో సమర్థులై ఏడు సంఘములతోకూడిన మీరు, రథేషు = మీ రథములందు, పృషతీః = తెల్లటి బిందువులతోకూడిన, మృగీః = మృగములను, యత్ = ఎప్పుడు, అయుగ్ధ్వం=అభిముఖముగా నియోగించారో అప్పుడు పర్వతములు బేదించబడినవి.

వ్యా॥వి॥ మనోఽజువః=జూ అనునది సూత్రపరమైన ధాతువు, గమనార్థములోనున్నది. "క్విబ్వచిప్రచ్ఛి" ఇత్యాది (2-215) ఉణాది సూత్రముచే క్విప్, దీర్ఘములు ఏర్పడినవి. అయుగ్ధ్వం = యుజిర్ యోగే అనుధాతువునకు లుఙ్లకారమునందు మధ్యమపురుషబహువచనము. "ధిచ" (8-2-25) అనుపాణిని సూత్రముచే సకారలోపము వచ్చెను.

స్వ॥వి॥ సుఽమఖాసః = "సర్వేవిధయశ్ఛందసి వికల్ప్యంత" అను వచనానుసారము "నఞ్ సుభ్యాం" అనుసూత్రము ప్రవర్తించ-

నప్పుడు బహు వ్రీహిసమాసమునందు పూర్వపద ప్రకృతిస్వరము (అద్యుదాత్తము) వచ్చెను.

సం॥పా ౫) ప్రయద్రథేషు పృషతీరయుగ్ధ్వం
వాజే అద్రిం మరుతోరంహ యంతః॥
ఉతారుషస్య విష్యంతి ధారాశ్చర్మేవో
దభిర్వ్యం దంతిభూమ॥

ప॥ పా॥ ప్ర। యత్। రథేషు। పృషతీః। అయుగ్ధ్వం। వాజే। అద్రిం। మరుతః। రంహయంతః। ఉత। అరుషస్య। వి। స్యంతి। దారాః। చర్మఽఇవ। ఉదఽభిః। వి। ఉందంతి। భూమ।

సా॥ భా॥ హే మరుతః పృషతీః యద్యదా రథేషు ప్రాయుగ్ధ్వం-ప్రాయూయుజత, కింకుర్వంతః వాజే-అన్నే నిమిత్తభూతేసతి, అద్రిం-మేఘం, రంహయంతః-వర్షణార్థం ప్రేరయంతః, తదానీం అరుషస్యారోచమానస్య సూర్యస్య వైద్యుతాగ్నేర్వా. సకాశాత్ వృష్ట్యుదకధారాభవంతో విష్యంతి విముంచంతి. విముక్తాస్తాశ్చధారాః ఉదభిః-ఉదకైశ్చర్మేవ పరిమితమల్పం చర్మయథా ప్రయత్నేన క్లేద్యతే ఏవం భూమ సర్వాం భూమిం వ్యుందంతి - విశేషేణార్ద్రాం కుర్వంతి॥

సా॥ భా॥ అను॥ ఓ మరుద్దేవతలారా! పృషతీః = తెల్లటి బిందువులతోకూడిన మృగములను, యత్ = ఎప్పుడు, రథేషు=రథము లందు, ప్రాయుగ్ధ్వం = బంధించారో! ఏమి చేయుచూ అనగా? వాజే = అన్నము నిమిత్తముకాగా, అద్రిం = మేఘమును, రంహ-

యంతః = వర్షించుటకొరకు ప్రేరేపించుతూ, అరుషస్య = మెరుపులతో కూడిన మేఘము సకాశము నుండి వర్షజలధారలు మిమ్ములను, విష్యంతి = వదలిపెట్టుచున్నవి, ధారాః = వదలిపెట్టబడిన ఆ ధారలు, ఉదభిః = ఉదకములతో, చర్మేవ = పరిమితమగు చర్మము అప్రయత్నముగనే ఎట్లు తడుపబడునో అట్లు భూమ = భూమండలమంతటినీ, వ్యుందంతి = విశేషముగా తడుపుచున్నవి.

వ్యా॥ వి॥ రంహయంతః = రహిగతౌ అను ధాతువునుండి నిష్పన్నమైన శతృ ప్రత్యయరూపము, ప్రథమా బహువచనము, విష్యంతి = వి అను ఉపసర్గపూర్వకముగా "షో అంతకర్మణి" అను దైవాదికధాతువునకు "ఓతఃశ్యని" (7-3-71) అను పాణినిసూత్రముచే వికరణ ప్రత్యయముశ్యన్ పరములో ఉండగా ఓకారలోపము వచ్చెను, "ఉపసర్గాత్సునోతి" అను సూత్రముచే (8-3-65) శకారమునకు షత్వము వచ్చి రూపమేర్పడెను. ఉదభిః = "పద్దన్నోమాస్" ఇత్యాది (6-1-63) సూత్రముచే ఉదక శబ్దమునకు ఉదన్నాదేశము వచ్చి తృతీయా బహువచనరూపము ఏర్పడినది. వ్యుందంతి = ఉన్దీక్లేదనే అనుధాతువునకు లట్ ప్రథమపురుష బహువచనము.

సం॥పా॥ 6) ఆవోవహంతు సప్తయో రఘుష్యదో
రఘుపత్వానః ప్రజిగాత బాహుభిః॥
సీదతా బర్హిరురువః సదస్కృతం
మాదయధ్వం మరుతో మధ్వో అంధసః॥

పద॥ పా॥ ఆ। వః। వహంతు। సప్తయః। రఘుఽస్యదః।
రఘుఽపత్వానః। ప్ర। జిగాత। బాహుఽభిః।

సీదత। ఆ। బర్హిః। ఉరు। వః। సదః। కృతం।
మాదయధ్వం। మరుతః। మధ్వః। అంధసః॥

సా॥ భా॥ హే మరుతః వః-యుష్మాన్, సప్తయః-సర్పణశీలా అశ్వాః, ఆవహంతు - అస్మద్యజ్ఞం ప్రాపయన్తు. కీదృశాః సప్తయః రఘుష్యదః-లఘుశీఘ్రం స్యందమానాః, వేగేన గచ్ఛంత ఇత్యర్థః రఘుపత్వానః - లఘుశీఘ్రం పతంతో గచ్ఛంతః యూయం, బాహుభిః-స్వకీయైర్హస్తైః అస్మభ్యం దాతవ్యంధనమాహృత్య, ప్రజిగాత-ప్రకర్షేణగచ్ఛత, హే మరుతః-వః-యుష్మాకం, సదః-సదనం వేదిలక్షణంస్థానం, ఉరు-విస్తీర్ణం కృతం. తత్రయదాస్తీర్ణం బర్హిస్తదాసీదత-తస్మిన్బర్హిష్యుపవిశత. ఉపవిశ్యచమధ్వః - మధురస్య, అంధసః-సోమలక్షణస్యాన్నస్యపానేన, మాదయధ్వం-తప్తాభవత॥

సా॥ భా॥ అను॥ ఓ మరుద్దేవతలారా! వః = మిమ్ములను, సప్తయః = సంచరించు స్వభావముగల అశ్వములు, ఆవహంతు = మా యజ్ఞమునకు పిలుచుకొని వచ్చెదరుగాక! ఎటువంటి అశ్వములు? రఘుష్యదః = వేగముగా ప్రయాణించునవి, రఘుపత్వానః = వేగముగా ప్రయాణించు మీరు, బాహుభిః = మీ హస్తములచేత మాకు ఇవ్వవలసిన ధనమును ఇచ్చి, ప్రజిగాత = గొప్పగా వెళ్ళుడు. ఓ మరుద్దేవతలారా! వః = మీయొక్క, సదః = నివాసస్థలము (వేదిలక్షణము) ఉరు = విస్తీర్ణము చేయబడినది, బర్హిస్సులు పరచబడినప్పుడు, సీదత = ఆ బర్హిస్సులందు కూర్చొనుడు, కూర్చొని, మధ్వః = మధురమైన, అంధసః = సోమరసమును త్రాగుటవలన, అన్నమును భుజించుటవలన, మాదయధ్వం = తృప్తిని పొందుడు.

వ్యా॥ వి॥ రఘుష్యదః - రఘుస్యందత ఇతి రఘుష్యదః అని వ్యుత్పత్తి. స్యన్దూ ప్రస్రవణే అనుధాతువునకు "క్విప్ చ" (3-2-76)

అనుసూత్రముచే క్విప్ ప్రత్యయము వచ్చి లోపమును పొందెను. అనిదితాంహల ఉపధాయాః ఇత్యాది సూత్రముచే (6-3-26) నకార-లోపము వచ్చెను. రఘుపత్వానః = రఘుపతంతీతి రఘుపత్వానః అని వ్యుత్పత్తి. "పత్లృ గతౌ" అనుధాతువునకు "అన్యేభ్యోఽపి దృశ్యంత (3-2-278)" అనుసూత్రముచే వనిప్ ప్రత్యయము చేయగా రూప-మేర్పడెను. జిగాత-గాస్తుతౌ అనుధాతువు జుహోత్యాది ప్రకరణము-లోనిది. జిగాతి అనునది గతికర్మలందు పఠించుటవలన ఇచ్చట గత్యర్థమునందు స్వీకరించబడెను. లోణ్మధ్యముపురుష బహువచనము నకు "తప్తనప్తనథనాశ్చ" (7-1-45) అను పాణిని సూత్రముచేత తబాదేశము వచ్చెను. అది పిత్వమగుటవలన (జిత్వముకాదు గనుక) "ఈ హల్యఘోః" అను (6-4-113) సూత్రముచే ఈత్వమురాదు. సదః – అతఃకృకమికంస కుంభపాత్ర" (8-3-46) ఇత్యాది పాణిని సూత్రముచే విసర్గలకు సత్వము వచ్చెను, మాదయధ్వం = మద తృప్తియోగే అను ఆత్మనే పదధాతువునకు లోణ్మధ్యమపురుష బహు-వచనము.

స్వ॥వి॥ రఘుఽస్యదః-ఇచ్చటకృదుత్తరపదప్రకృతిస్వరము (ఉదాత్తము) వచ్చెను.

సం॥ పా॥ 7) తేఽవర్ధంతస్వతవసోమహిత్వనానాకం
తస్థురురుచక్రిరే సదః। విష్ణుర్యద్ధావదృషణం
మదచ్యుతంవయో నసీదన్నధి బర్హిషి ప్రియే॥

ప॥ పా॥ తే। అవర్ధంత। స్వఽతవసః। మహిఽత్వనా। ఆ। నా-కం। తస్థుః। ఉరు। చక్రిరే। సదః। విష్ణుః। యత్[1] హ। అవత్। వృషణం। మదఽచ్యుతం। వయః। న। సీదన్। అధి। బర్హిషి। ప్రియే॥

సా॥ భా॥ తే-మరుతః, అవర్ధంత - వృద్ధింగతాః, కీదృశాః, స్వతవసః_స్వాశ్రయబలాః నాన్యస్యకస్యచిద్బలమపేక్షంతే, వృద్ధిం ప్రాప్యచ. మహిత్వనా_మహిమ్నా, నాకం-స్వర్గం, ఆతస్థుః-ఆస్థిత వంతః, సదః-సదనం నభోలక్షణంస్థానం చ స్వకీయ నివాసాయ, ఉరు-విస్తీర్ణం, చక్రిరే. యద్యేభ్యో మరుద్భ్యో, యదర్థం వృషణం - కామాభివర్షకం, మదచ్యుతం-మదస్యహర్షస్యాసేక్తారం యజ్ఞం, విష్ణుర్హావత్_విష్ణురేవా గత్యరక్షతి, తే-మరుతః, వయోన_పక్షిణో యథా శీఘ్రమాగచ్ఛంతి ఏవం శీఘ్రమాగత్య, బర్హిష్యధి.అస్మదీయేయజ్ఞే, ప్రియే ప్రీతికరే, సీదన్-సీదంతు ఉపవిశంతు.

సా॥భా॥అను॥ తే = ఆమరుత్తులు, అవర్ధంత=వృద్ధిని పొందిరి. ఎటువంటివారు? స్వతవసః = స్వయంశక్తికలవారు. ఇతరులబలమును అపేక్షించనివారు, వృద్ధినిపొంది, మహిత్వనా = మహిమచేత, నాకం= స్వర్గమును, ఆతస్థుః = పొందిరి. సదః = సదనమును (ఆకాశమును తమ నివాసముకొరకు) ఉరు = విస్తీర్ణముగా, చక్రిరే = చేసిరి. యత్ = ఏమరుత్తుల కొరకు, వృషణం = కోరికలను తీర్చు, మదచ్యుతం = సంతోషమును వృద్ధిచేయుయజ్ఞమును, విష్ణుర్హావత్=విష్ణువే స్వయముగా వచ్చి రక్షిస్తాడో, తే = ఆమరుత్తులు, వయోన=పక్షులు ఎట్లైతే శీఘ్రముగా వస్తాయో అట్లు శీఘ్రముగా వచ్చి, ప్రియే = ప్రీతికరమైన, బర్హిష్యధి = మన యజ్ఞమునందు, సీదన్ = ఆసీనులగుదురుగాక!

వ్యా॥వి॥ యత్ = (యేభ్యః) "సుపాంసులుక్" అనుసూత్రముచే (7-1-39) చతుర్థీవిభక్తి ప్రత్యయమునకు లోపము వచ్చెను. అవత్ (రక్షతి) ఇది ఛాందస ప్రయోగము, వర్తమాన కాలికలజ్.

వృషణం = వాషపూర్వస్యనిగమః (6-4-9) అనుసూత్రముచే ఉపదా దీర్ఘమురాలేదు. మదచ్యుతం = మదంచ్యోతతీతి మదచ్యుత్ అని వ్యుత్పత్తి, చ్యుతిర్ ఆసేచనే అనుధాతువునకు "క్విప్‌చ"అను (3-2 76) సూత్రముచే క్విప్ ప్రత్యయము, దానికి లోపము వచ్చెను.

స్వ॥ వి॥ తేఽవర్ధంత = స్వరితోవానుదాత్తే పదాదౌ" అను (8-2-6) పాణినిసూత్రముచే ఏకాదేశమునకు (తేఅనుచోట ఏకారమునకు) స్వరితము వచ్చెను. మహిఽత్వనా = భావ ప్రత్యయమునకంటే (త్వ) పరములోనున్న ఆజ్‌నకు వ్యత్యయముగానాభావము, ఉదాత్త స్వరము వచ్చెను.

సం॥పా॥ 8) శూరాఇవేద్యుయుధ యోనజగ్మయః
ప్రశవస్య వోనపృతనాసు యేతిరే॥
భయంతే విశ్వాభువనా మరుద్భ్యో
రాజాన ఇవత్వేష సందృశోనరః॥

ప॥ పా॥ శూరాఃఽఇవ| ఇత్| యుయుధయః| న| జగ్మయః|
ప్రశవస్యవః| న| పృతనాసు| యేతిరే| భయంతే|
విశ్వా| భువనా| మరుత్ఽభ్యః|రాజానఃఽఇవ|త్వేషఽ
సందృశః| నరః॥

సా॥ భా॥ శూరాఇవేత్ - శౌర్యోపేతాయుయుత్సవః పురుషా ఇవ,యుయుధయః-శత్రుభిర్యుధ్యమానాః పురుషాఇవచ. జగ్మయః - శీఘ్రంగచ్ఛంతో మరుతః, ప్రశవస్యవోన-ప్రశవోఽన్నమాత్మన ఇచ్ఛంతః పురుషా ఇవ, పృతనాసు- సంగ్రామేషు, యేతిరే - ప్రయతంతే, వృత్రాదిభిర్యుద్ధేవ్యాప్రియంతే. తాదృశేభ్యోమరుద్భ్యో,విశ్వాభువనా-సర్వాణి భూతజాతాని, భయంతే-బిభ్యతి, యేనరః - వృష్ట్యాదేర్నే

తారో మరుతః, రాజాన ఇవ - రాజమానాన్నృపతయఇవ, త్వేషసం-
దృశః-దీప్తసందర్శనా ఉగ్రరూప తయాద్రష్టుమశక్యా భవంతి.

సా॥ భా॥ అను॥ శూరా ఇవేత్ = శౌర్యముతో కూడిన యుద్ధ పురుషులకువలె, యుయుధయః = శత్రువులతో యుద్ధము చేయు పురుషులవలె, జగ్మయః = శీఘ్రముగా సంచరించు మరుత్తులు, శ్రవస్యవోన = అన్నమును అభిలషించు పురుషులవలె, పృతనాసు = యుద్ధములందు, యేతిరే = ప్రయత్నముచేయుచున్నారు. పృథ్వాదులతో యుద్ధమునందు ప్రవర్తించుచున్నారు. అటువంటి, మరుద్భ్యః = మరుత్తులవలన, విశ్వాభువనా = సమస్తభూతజాతములు, భయంతే = భయపడుచున్నారు. యేనరః = వర్షమునకు నాయకులగుమరుత్తులు రాజానఇవ = ప్రకాశించు రాజులవలె, త్వేషసందృశః = ప్రకాశించుచూ ఉగ్రరూపము దాల్చినవారై చూచుటకు అశక్యముగా ఉన్నారు.

వ్యా॥ వి॥ యుయుధయః = యుధసంప్రహారే అనుధాతువునకు "ఆదృగమహనజన" అను (3-2-171-2)పాణిని సూత్రమునందు ఉత్సర్గశ్ఛందసిఅనువచనమువలన కిన్ ప్రత్యయమువిధించబడెను. విద్వద్ భావమువలన ద్విర్భావాదులు (ద్విత్వాదులు) ఏర్పడెను, కిత్వమువలన గుణమురాలేదు. జగ్మయః = గమ్లృగతౌ అనుధాతువునకు పై సూత్రముచేతనే (3-2-171-2) కిన్ ప్రత్యయము గమహనజనఖనఘసాంలోపః కిఙత్యనఙి (6-4-98) అనుసూత్రముచేత ఉపధాలోపము వచ్చెను. స్థానివద్భావమువలన ద్విర్భావాదులు వచ్చి రూపముసిద్ధించెను. శ్రవస్యవః = (శవః=అన్నమును) ఇచ్ఛతి శ్రవస్యతి, క్యాచ్ఛందసి (3-2-170) అనుసూత్రముచే క్యప్రత్యయాంతమగు శ్రవస్య శబ్దమునకు ఉ ప్రత్యయము వచ్చెను. యేతిరే =

(ప్రయతంతే) యతీ ప్రయత్నే అనుధాతువునకు "ఛందసి లుఙ్ లఙ్ లిటః" (3-4-6) అని వర్తమానకాలమునందు లిట్ విధించబడెను. భయంతే = ఞిభీభయే అనుధాతువునకు "బహులంఛందసి" అను సూత్రమువలన శప్‌నకు శ్లుత్వము రాలేదు. త్వేషసందృశః = త్విషదీప్తౌ అనుధాతువునకు "పచాద్యచ్" (3-1-34) అనుసూత్రముచే అచ్ విధించబడెను. సంపూర్వకనుగు "దృశిర్ ప్రేక్షణే" అనుదాతువునకు సంపదాది లక్షణము భావార్థమునందు క్విప్ ప్రత్యయిము వచ్చెను.

స్వ॥ వి॥ యుయుధయః = కిస్ ప్రత్యయము నిత్వముగుట వలన ఆద్యుదాత్తస్వరము వచ్చెను. త్వేషసందృశః = ఇది బహు-వ్రీహిసమాసము కాన పూర్వపద ప్రకృతిస్వరము (ఉదాత్తము) వచ్చెను.

సం॥పా॥ 9) త్వష్టాయద్వజ్రం సుకృతం హిరణ్యయం
సహస్రభృష్టిం స్వపా అవర్తయత్॥
ధత్త ఇంద్రోనర్యపాంసి కర్తవేఽహ
న్వృత్రం నిరపా మౌబ్జదర్ణవమ్॥

ప॥ పా॥ త్వష్టా। యత్। వజ్రం। సుఽకృతం। హిరణ్యయం।
సహస్రఽభృష్టిం। సుఽఅపాః। అవర్తయత్। దత్తే।
ఇంద్రః। నరి। అపాంసి కర్తవే। అహన్। వృత్రం।
నిః। అపాం। ఔబ్జత్। అర్ణవమ్॥

సా॥ భా॥ స్వపాః-శోభనకర్మా, త్వష్టా-విశ్వనిర్మాతా, యద్వజ్రమవర్తయత్ - ఇంద్రం ప్రత్యగమయత్. దత్తావా నిత్యర్థః। కీ-దృశం! సుకృతం-సమ్యక్‌నిష్పాదితం, హిరణ్యయం-సువర్ణమయం

సహ్రసభృష్టిం-అనేకాభిర్ధారాభిర్యుక్తం, తద్వజ్రమింద్రోధత్తే, ధార-యతి, కిమర్థం? నరి-సంగ్రామే, అపాంసి-శత్రుహననాదిలక్షణాని కర్మాణి, కర్తవే-కర్తుం, ఏవం వజ్రం ధృత్వాతేనవజ్రేణ, వృత్రం-వృష్ట్యుదకస్యావరకం, అర్ణవం-అర్ణసోదకేనయుక్తం మేఘం, అహన్-అవధీత్,అపాం-తేననిరుద్ధాఅపశ్చ సనిశౌబ్జత్-నిఃశేషేణాధోముఖమపాతయత్, ప్రవృష్టా అకరోదిత్యర్థః॥

సా॥భా॥అను॥ స్వపాః = శుభకర్మలను చేయు, త్వష్టా=విశ్వ నిర్మాత, యద్వజ్రమవర్తయత్ = వజ్రాయుధమును ఇంద్రున కిచ్చెను. ఎటువంటిది? సుకృతం = చక్కగా సిద్ధము చేయబడినది. హిరణ్యయం = సువర్ణమయమైనది, సహస్రభృష్టిం = అనేకములగు ధారలతోకూడినది, ఆ వజ్రమును ఇంద్రుడు ధరించెను. ఎందులకు? నరి = యుద్ధమునందు, అపాంసి = శత్రువులను సంహరించు మొదలగు కర్మలను, కర్తవే = చేయుటకు, ఇట్లు వజ్రమును ధరించి ఆ వజ్రముతో వృత్రం = వర్షజలమును అడ్డగించువానిని, అర్ణవం = జలముతోకూడిన మేఘమును, అహన్ = హింసించెను. అపాం = వృత్రునిచే అడ్డగించబడిన జలమును, సనిరౌబ్జత్=ఇంద్రుడుపూర్తిగా అదోముఖముగా భూమిమీద పడునట్లు చేసెను. (బాగా వర్షించునట్లు చెసెనని అర్థము.)

వ్యా॥వి॥ సుఽకృతం = సు అను ఉపసర్గపూర్వకముఃగా "డు కృఞ్" కరణే అనుధాతువునకు కర్మణి ప్రయోగమునందు నిష్ఠా (క్త) ప్రత్యయము వచ్చెను. హిరణ్యయం = హిరణ్యశబ్దమునకు పరములో ఉన్న మయట్ ప్రత్యయముకారమునకు లోపము "ఋత్వ్యవాస్త్వ్యవాస్త్వమాధ్వీహిరణ్యయాని.ఛందసి అను(6-4-175) సూత్రమునందు

నిపాతనమువలన సిద్ధించెను. కర్తవే = తుమర్థేసేసేన్‌సే అసేన్ ఇత్యాది (3-4-9) సూత్రముచే కృధాతువునకు తవేన్ ప్రత్యయము విధించబడెను. అపాం = క్రియాగ్రహణం కర్తవ్యం అని వచనము వలన కర్మసంప్రదానమును పొందుటచేత చతుర్థ్యర్థమునందు షష్ఠీ-విభక్తి ఏర్పడెను. ఔబ్జత్ ఉబ్జ ఆర్జవే అనుధాతువునకు లఙ్ ప్రథమ పురుషైకవచనం. అర్ణవం = అర్ణసోలోపశ్చ (5-2-109, 3) అను సూత్రముచే సలోపము మత్వర్థీయవ ప్రత్యయము విధించ-బడెను.

స్వ॥ వి॥ సుఽకృతం = గతిరనంతర అను సూత్రముచే (6-2-49) గతి సంజ్ఞను పొందిన (సు) దానికి ప్రకృతి స్వరము (ఉదాత్తము) వచ్చెను. సుఽఅపాః = "సోర్మనసీ అలో మోషసీ" (6-2-117) అనుసూత్రముచేత ఉత్తరపదాద్యుదాత్తము ఏర్పడెను. అపాం = "ఊడిదం పదాద్యప్పుమ్రైద్యుభ్యః" అను సూత్రముచే (6-1-171) షష్ఠివిభక్తికి ఉదాత్తమేర్పడెను.

సం॥పా॥ 10) ఊర్ధ్వం నునుద్రేఽవతంత ఓజసా
దాదృహాణం చిద్బిభిదుర్విపర్వతమ్॥
ధమంతో వాణం మరుతః సుదానవో
మదే సోమస్యరణ్యాని చక్రిరే॥

ప॥ పా॥ ఊర్ధ్వం। నునుద్రే। అవతం। తే। ఓజసా। దదృహాణం। చిత్। బిభిదుః। వి। పర్వతం। ధమంతః। వాణం। మరుతః। సుఽదానవః। మదే। సోమస్య। రణ్యాని। చక్రిరే॥

సా॥భా॥ అత్రేయమాఖ్యాయికా! గోతమఋషిః పిపాస యా

పీడితః సన్మరుతః ఉదకం యయాచే। తదనంతరం మరుతోఽ దూరస్థం కూపముద్ధృత్యయత్రసగోతముఋషిస్తిష్ఠతి తాందిశం నీత్వాఋషి సమీపేకూపమవస్థాప్య తత్పార్శ్వే ఆహావం చకృత్వాతస్మిన్నాహావేకూపముత్సిచ్యత మృషిం తేనోదకేనతద్పయాం చక్రుః। అయమర్థోఽనయోత్తరయాచ ప్రతిపాద్యతే। తే-మరుతః, అవతం-కూపం, ఊర్ధ్వం-ఉపరియథాభవతి తథా, ఓజసా-స్వకీయేనబలేన, నునుద్రే-ప్రేరితవంతః, ఉత్థాతవం-త ఇత్యర్థః। ఏవం కూపముత్థాయ ఋషేరాశ్రమం ప్రతినయంతోమరుతః మార్గమధ్యే, దాదృహాణం - ప్రవృద్ధం గతినిరోధకం, పర్వతంచిత్-పర్వవంతం శిలోచ్చయమపి, విబిభిదుః విశేషేణబభంజుః, సుదానవః - శోభనదానాస్తే మరుతః, వాణం-శతసంఖ్యాభిస్తం త్రీభిర్యుక్తంవీణావిశేషం, ధమంతః - వాదయంతః, సోమస్యమదేఽసోమపానేన హర్షేసతి, రణ్యాని-స్తుత్యానిరమణీయాని ధనాని, చక్రిరే-స్తోతృభ్యః కుర్వంతి॥

సా॥ భా॥ అను॥ గౌతమఋషి (ఇచ్చట ఒకకథ అన్వయించబడుతుంది) "దాహముచేత పీడించబడి" మరుత్తులను ఉదకముకొరకు యాచించెను. అప్పుడు మరుత్తులు సమీపములోని "బావిని" పైకితీసి ఎచ్చట గౌతమఋషి కలడో అచ్చటకు దానిని తీసుకొని వెళ్ళి అతని ముందుంచి అతనికి దగ్గరలోనే గుంటను త్రవ్వి దానియందు బావి లోని జలమును పోసి గౌతమఋషిని ఆ జలముతో తర్పణ చేసిరి అను ఈ కథా సన్నివేశము రెండుఋక్కుల (10,11) ద్వారా ప్రతిపాదింపబడుతుంది.

తే = ఆ మరుత్తులు, అవతం = బావిని, ఊర్ధ్వం = పై భాగమునకు వచ్చునట్లు, ఓజసా = తమయొక్క బలముచేత, నునుద్రే =

ప్రేరేపించిరి. (ప్రవిర్రి) ఇట్లు ఆ మరుత్తులు బావిని ప్రవిష్టి ఋషాశ్రమమునకు తీసుకొని వెళుతుండగా మద్యేమార్గంలో, దాదృహాణం= వృద్ధిచెందిన మార్గము నడ్డగించు, పర్వతంచిత్ = పర్వతమునుకూడా విబిభిదుః = విశేషముగా భగ్నము చేసిరి. సుదానవః = శుభకరమగు వస్తువులను ఇచ్చు, తే=ఆ మరుత్తులు, వాణం = వంద తీగెలతోకూడిన వీణావిశేషమును, ధమంతః = వాదనచేయుచూ, సోమస్యమదే = సోమపానమువలన సంతోషమును పొందుచూ, రణ్యాని=రమణీయము లగు ధనములను చక్రిరే = కల్పన చేసిరి, వారిని స్తోత్రము చేయు వారికి ఇచ్చిరి.

వ్యా॥ వి॥ నునుద్రే = ణుద ప్రేరణే అనుధాతువునకు "లిటీరయోరః" అనుసూత్రముచే లిట్ లకారమునందు "రే" ఆదేశము వచ్చెను. దదృహాణం = (ప్రవృద్ధం) దృహదృహివృద్ధౌ అను ధాతువునకు లిట్ లకారములో కానచ్ ప్రత్యయము వచ్చి రూపమేర్పడెను. ధమంతః = ధ్మా శబ్దాగ్ని సంయోగయోః అనుధాతువునకు "పాఘ్రాధ్మాదేట్ దృశః సః" అనుసూత్రముచే (3-1-137) ధమాదేశము వచ్చెను. వాణం = అణరణవణశబ్దార్థాః అనుధాతుసమూహమునకు కర్మణి ఘఞ్ ప్రత్యయము విధించబడెను. రణ్యాని = రణదాతువునకు భావార్థములో "వశిరణ్యోరుపసంఖ్యానం" అను (3-3-58,3) పాణినిసూత్రముచే అప్ ప్రత్యయము, "తతోభవే ఛందసి" అనుసూత్రముచే యత్ ప్రత్యయము విధించబడి రూపము సిద్ధించెను.

స్వ॥ వి॥ వాణం=కర్షాత్వతో ఘఞోఽంతఉదాత్తః (6-1-159) అనుసూత్రముచే ఘఞన్తముగుపదమునకు అంతోదాత్తముసిద్ధించినది

రణ్యాని = ఇచ్చట "యతోఽనావః" (6-1-213) అనుసూత్రముచే ఆద్యుదాత్తము వచ్చెను.

సం॥పా॥ 11) జిహ్మం నునుద్రేఽవతంతయా దిశాసించన్నుత్సం
గోతమాయ తృష్ణజే।
ఆగచ్ఛంతీ మవసాచిత్రభానవః కామంవిప్రస్య
తర్పయంత ధామభిః॥

ప॥పా॥ జిహ్మం। నునుద్రే। అవతం। తయా। దిశా। అసించన్। ఉత్సం। గోతమాయ। తృష్ణఽజే।ఆ। గచ్ఛంతి। ఈం। అవసా। చిత్రఽభానవః। కామం। విప్రస్య। తర్ప యంత। ధామభిః॥

సా॥భా॥ మరుతః, అవతం ఉద్ధృతంకూపంయస్యాందిశిఋషిర్వ సతితయాదిశా జిహ్మం-వక్రంతిర్యంచం, నునుద్రే - ప్రేరితవంతః, ఏవంకూపంనీత్వా ఋష్యాశ్రమేఽవస్థాప్య, తృష్ణజే - తృషితాయ, గోతమాయ-ఋషయే, తదర్థముత్సం-జలప్రవాహం కూపాదుద్ధృత్య, అసించన్-ఆహావేఽవానయన్. ఏవంకృత్వా, ఈమేనంస్తోతారమృషిం, చిత్రభానవః-విచిత్రదీప్తయస్తే మరుతః,అవసా - ఈదృశేనరక్షణేన - సహాగచ్ఛంతి-తత్సమీపం ప్రాప్నువంతి, ప్రాప్యచ. విప్రస్య-మేధావినోగోతమస్య, కామం-అభిలాషం, ధామభిః - ఆయుషోధారకైః ఉదకైః, తర్పయంత-అతర్పయన్॥

సా॥భా॥అను॥ తే = ఆమరుత్తులు, అవతం = త్రవ్వినబావిని ఏదిక్కున, గౌతముఋషికలడో, తయాదిశా = ఆ దిక్కువైపు, జిహ్మం = వక్రముగా, నునుద్రే = ప్రేరేపించిరి. ఇట్లు బావిని ఋష్యాశ్రమము

నందుంచి, తృష్ణజే = దప్పికతోనున్న, గోతమాయ = గౌతమఋషి కొరకు, ఉత్సం=జలప్రవాహమును బావినుండి సేకరించి, అసించన్= ఆ జలముతో తడిపిరి. ఇట్లు చేసిన తరువాత, ఈం = స్తోత్రముచేయు ఋషి సమీపమునకు, చిత్రభానవః = విచిత్రమైన కాంతులుగల ఆ మరుత్తులు, అవసా = రక్షణతోకూడా వచ్చుచున్నారు. సమీపమును పొంది, విప్రస్య = మేదావియగు గౌతమునియొక్క, కామం = అభిలాషను, ధామభిః = ఆయుష్షును నిలుపు ఉదకముచేత, తర్ప-యంత = తృప్తిపరచిరి.

వ్యా॥వి॥ తృష్ణజే = ఞితృషాపిపాసాయాం అనుధాతువునకు స్వపితృషోర్నజిజ్ అను (3-2-172) సూత్రముచే నజిజ్ ప్రత్యయము విధించబడి తృష్ణజే అను చతుర్థీవిభక్తి రూపముఏర్పడును. ధామభిః= ధారణార్థకధాధాతువునకు ఆతోమనిన్ అను సూత్రముచే మనిన్ ప్రత్యయము విధింపబడినది. (ధామన్)

స్వ॥ వి॥ తయా = సావేకాచ స్తృతీయాదిర్విభక్తిః అనుసూత్రముచేత (6-1-618) తృతీయావిభక్తికి వచ్చిన ఉదాత్తమునకు "నగోశ్వన్సావ వర్ణరాడంకుంకృద్భ్యః" అనుసూత్రముచే (6-1-168) నిషేధము. =దివాసావేకాచ (6-1-618)అనుసూత్రముచే తృతీయావిభక్తి ప్రత్య-యమునకు ఉధాత్తము వచ్చెను.

సం॥పా॥ 12) యావః శర్మశశమానాయసన్తి
త్రిధాతూని దాశుషే యచ్ఛతాధి।
అస్మభ్యం తాని మరుతోవియంత
రయింనో దత్తవృషణః సువీరం॥

సం॥పా॥ యా। వః। శర్మ। శశమానాయ। సంతి। త్రిఽధా। తూని। దాశుషే। యచ్ఛత। అధి। అస్మభ్యం। తాని

మరుతః। వి। యంత। రయిం। నః। ధత్త।వృషణః।
సుఽవీరమ్॥

సా॥ బా॥ హే మరుతః, వః-యుష్మాకంసంబంధీని, యా-యాని, శర్మ-శర్మాణిసుఖానిగృహాణివా, కీదృశాని! త్రిధాతూని-పృథివ్యాదిషుత్రిషుస్థానేష్వవస్థితాని, శశమానాయ-యుష్మాన్ స్తుతిభిర్భజమానాయదాతుంసంపాదితాని పూర్వోక్తలక్షణానిశర్మాణియానిసంతి యానిచ, దాశుషే - హవిర్దత్తవతే యజమానాయ, అధియచ్ఛత అధికం ప్రయచ్ఛథ। హే మరుతః తాని సర్వాణిశర్మాణి, అస్మభ్యంవియంత-విశేషేణప్రయచ్ఛత। కించ హే వృషణః.కామానాం వర్షితారో మరుతః, నః-అస్మభ్యం, సువీరం-శోభనైర్వీరైః పుత్రాదిభిర్యుక్తం రయిం-ధనం, ధత్త-దత్త॥

సా॥బా॥అను॥ హే మరుతః = ఓ మరుద్దేవతలారా! వః=మీకు సంబంధించిన, యా = ఏ, శర్మ = సుఖములు లేక గృహములు, ఎటువంటివనగా, త్రిధాతూని = పృదివీ మొదలగు ముల్లోకములలో నున్నవి. శశమానాయ = మిమ్ములను స్తోత్రములద్వారా సేవించు వారికి ఇచ్చుటకు సంపాదించబడినవి. ఇప్పుడు చెప్పిన లక్షణములతో కూడిన సుఖములు ఏవికలలో వాటిని, దాశుషే = హవిస్సులను సమర్పించిన యజమానికొరకు, అధియచ్ఛత = అధికముగా ఇచ్చుము. ఓ మరుద్దేవతలారా! తాని = అన్ని సుఖములను, అస్మభ్యంవియంత= మాకు విశేషముగా ఇచ్చుదురుగాక. ఇంకనూ! హే వృషణః = కోరికలను తీర్చు ఓ మరుద్దేవతలారా! నః = మాకు, సువీరం = శుభకరమగు వీరపుత్రులతోకూడిన, రయిం = ధనమును, ధత్త = ఇవ్వుము.

వ్యా॥వి॥ యాః=(యాని) "శేశ్ఛందసిబహులమ్" అనుసూత్రముచే (6-1-70) ి అనుదానికి లోపము వచ్చెను. శర్మ = (శర్మాణి)

"సుపాంసులుక్" (7-1-39) అనుసూత్రముచే జస్ ప్రత్యయమునకు లోపము వచ్చెను. శశమానాయ = శశప్లుతగతౌ అనుధాతువునకు తాచ్ఛీలికార్థమునందు చానశ్ ప్రత్యయము వచ్చి రూపమేర్పడెను. యచ్ఛత (ప్రయచ్ఛథ) ఛాందసమగు లఙ్ లకారమునందు "బహులంఛందస్యమాఙ్యోగేపి" (6-4-75) అనుసూత్రముచే అడాగమము రాలేదు. యంత-యమధాతువునకు లోట్‌లకారమునందు బహులం ఛందసి" అనుసూత్రముచే (2-4-73) శప్‌నకు లోపము వచ్చెను. "తప్తనప్తనథనాశ్చ" అనుసూత్రముచే (7-1-45) శప్‌నకు త బాదేశము విధించబడెను. అది పిత్ అగుటవలన జిత్వముకానందున అను దాత్తోపదేశ వనతితనోత్యాదీనాం ఇత్యాదిసూత్రముచే (6-4-37) అనునాసికలోపము రాలేదు. వృషణః = వాషపూర్వస్యనిగమః(6-4-9) అనుసూత్రముచే ఉపధాదీర్ఘము రాలేదు.

స్వ॥ వి॥ సువీరం = ఇది బహువ్రీహిసమాసము. కాన "వీరవీర్యౌచ" అనుసూత్రముచే (6-2-120) సు అను దానికిపరములో నున్న వీరశబ్దమునకు ఆద్యుదాత్తము ఏర్పడెను.

---

## 4) ద్యావాపృథివీసూక్తము

సం॥ పా॥ 1) తేహి ద్యావాపృథివీ విశ్వశంభువ ఋతావరీ
రజసోధారయత్కవీ।
సుజన్మనీధిషణే అంతరీయతే దేవో దేవీ
ధర్మణా సూర్యః శుచిః॥

ప॥ పా॥ తే ఇతి। హి। ద్యావాపృథివీ ఇతి।. విశ్వఽశంభువా।
ఋతవరీ ఇత్యృతఽకవీ। రజసః। ధారయత్కవీ ఇతి
ధారయత్ఽకవీ। సుజన్మనీ ఇతిసుఽజన్మనీ। ధిషణే।
ఇతి। అంతః। ఈయతే। దేవః। దేవీ ఇతి। ధర్మణా।
సూర్యః శుచిః॥

సా॥ భా॥ తేహి-తేఖలు ప్రసిద్ధేద్యావాపృథివీ, అంతః-తయో రన్తరాలే, శుచిః - శుద్ధః విశ్వస్యశోచయితావా, దేవః-దీప్యమానః సూర్యః, ధర్మణా-ప్రకాశోదకదానాది ధారణేనయుక్తః సన్, ఈయతే- సర్వదాగచ్ఛతి। తాదృశం కర్మయువయోరను గ్రహాదితిస్తుతిః కీ- దృశ్యౌతే విశ్వశంభువా - విశ్వస్యసుఖయిత్ర్యావిత్యర్థః। ఋతావరీ- ఋతవత్యౌ, రజస ఉదకస్యోదకోత్పత్త్యై. ధారయత్కవీ - అకృచ్ఛ్రేణ ధారకంకవియయోస్తే తాదృశ్యౌ ఉదకోత్పాదనాయా ప్రయత్నవత్యా విత్యర్థః। యద్వా-ధారయత్క విర్మనీష్యాదిత్యోయయోస్తే తాదృశ్యౌ। వృష్ట్యుదకధారయత్పూర్యోపేతే ఇత్యర్థః। సుజన్మనీ-శోభనజన్మవత్యౌ। ధిషణే-ధర్షణోపేతేస్వ వ్యాపారేషు ప్రగల్భే ఇత్యర్థః। దేవీద్యోతమానే॥

సా॥ భా॥ అను॥ తేహి = ప్రసిద్ధులగు ద్యావాపృథివీల, అంతః = నడుమ, శుచిః = పరిశుద్ధుడు, విశ్వమును ప్రకాశింపచేయు, దేవః =

సూర్యుడు, ధర్మణా = ప్రకాశజలములను దానము చేయుటకొరకు ధరించినవాడై, ఈయతే = ఎల్లప్పుడూ వెళ్ళుచున్నాడు, అటువంటి కర్మద్యావాపృథివీల అనుగ్రహమువలన అని స్తోత్రము చేయబడును ఎటువంటివారు? (ఆద్యావాపృథివీలు), విశ్వశంభువా = విశ్వమునకు సుఖమును కలుగచేయువారు, ఋతావరీ = సత్యవంతులు, రజసోధార యత్కవీ = జలమును ఉత్పాదన చేయుటకొరకు ప్రయత్నములేని వారు, ప్రయత్నము చేయనివారు అని యర్థము లేక వర్షోదకమును ధరించు సూర్యునితోకూడినవారు అని అర్థము. సుజన్మనీ = శుభప్రద మగు జన్మకలవారు, ధిషణే = వారి వ్యాపారములందు ప్రగల్భము కలవారు, దేవీ = ప్రకాశించువారు.

వ్యా॥వి॥ ఈయతే = ఈఙ్‌గతౌ అను ఆత్మనే పదధాతువునకు లట్ ప్రథమపురుషైకవచనము. ఋతావరీ = ఋతశబ్దమునకు "ఛన్ద సీవనిపౌ" అనువార్తికముచేత (5-2-122) వనిప్ ప్రత్యయము రాగా "వనోరచ" (4-1-7) అను పాణినిసూత్రముచే నకారమునకు ఙీప్ రేఫములు వచ్చి ఋతావరీ అని సిద్ధించినది. రజసః = ఉదకమును, "ఉదకం రజఉచ్యతే" అని నిరుక్తం (4-19) ధిషణే_వారివ్యాపారము లందు (పనులందు) సమర్థులగు ద్యావాపృథివీలు.

సం॥పా॥ ౭) ఉరువ్యచసామహినీ అసశ్చతాపితా
మాతాచ భువనాని రక్షతః॥
సుధృష్టమేవపుష్యేఽనరోదసీ
పితాయత్సీమభిరూపైరవాసయత్॥

ప॥పా॥ ఉరుఽవ్యచసా। మహినీఇతి। అసశ్చతా। పితా।

మాతా। చ। భువనాని। రక్షతః। సుధృష్టమే ఇతి సుఽధృష్టమే। వపుష్యే ఇతి। న। రోదసీ ఇతి। పితా। యత్। సీం। అభి। రూపైః। అవాసయత్॥

సా॥ భా॥ ఉరువ్యచసా - ప్రభూతవ్యచనవత్యావతి విస్తీర్ణే, మహినీ-అతఏవమహత్యౌ, అసశ్చతా-అసజ్యమానే, పరస్పరవియుక్తే ఇత్యర్థః। పితా - పాలయిత్రీద్యౌః, మాతా-నిర్మాత్రీపృథివీచేత్యుభే, భువనాని-భూతజాతాని, రక్షతః-పాలయతః। కించసుధృష్టమే - అతిశయేనధృష్టే ప్రగల్భే, రోదసీ-ద్యావాపృథివ్యౌ, వపుష్యేన-వపుషో-హితేఇవ, ప్రాణినాంపితరావివశరీరరక్షకే ఇత్యర్థః యద్యస్మాత్సీం - సర్వతః పితా-పితృస్థానీయాద్యౌరూపైర్నిరూపణసాధనైః ప్రశస్తైః ప్రకాశైర్నిరూప్యమాణైర్వృష్ట్యాదిభిర్వాభ్యవాసయత్-అభివాసయతి, తస్మాత్ పితామాతా చ భువనాని రక్షతః॥

సా॥ భా॥ అను॥ ఉరువ్యచసా = మిక్కిలి విశాలములైనవి మహినీ = గొప్పమహిమకలవి, అసశ్చతా = పరస్పరము విడిగా ఉన్నవి అని అర్థము. పితా = పాలించు ఆకాశము, మాతా = నిర్మించుటకు కారణమగు భూమియునూ, భువనాని = లోకములను (జనులను) రక్షతః = పాలించుచున్నారు. ఇంకనూ సుధృష్టమే = మిక్కిలి గొప్పతనముకల, రోదసీ = ద్యావాపృథివీలు, వపుష్యేన = శరీరమునకు హితమువలె, ప్రాణులకు తల్లిదండ్రులవలె శరీరరక్షకులై యున్నారు. యత్ = ఎందువలననగా, సీం = అన్నివైపులా, పితా = పితృస్థానములోనున్న ఆకాశము, రూపైః = నిరూపించుసాధనముల చేత ప్రశస్తములగు ప్రకాశములచేత నిరూపించబడు వర్షము మొదలగువాటితో, అభ్యవాసయత్ = ఉన్నాడు, అందువలన తల్లి

తండ్రులగు ద్యావాపృథివీలు లోకములను రక్షించుచున్నారని అర్థము.

వ్యా॥ వి॥ సుధృష్టమే = మిక్కిలి గొప్పతనముగల ద్యావా పృథివీలు, మహినీ, వపుష్యే, రోదసీ అనుపదములు ప్రగృహ్య సంజ్ఞను పొందినవి గనుక పదపాఠములో ఇతి అనునది ఏర్పడెను. ఎట్లనగా మహినీఇతి-వపుష్యేఇ ఇతి రోదసీ ఇతి॥

సం॥పా॥ 3) సవహ్నిః పుత్రః పిత్రోః పవిత్రవాన్
పునాతి ధీరో భువనాని మాయయా।
ధేనుంచ పృశ్నిం వృషభం సురేతసం
విశ్వాహా శుక్రం పయోఅస్యదుక్షత॥

ప॥పా॥ సః। వహ్నిః। పుత్రః। పిత్రోః। పవిత్రఽవాన్।పునాతి ధీరః। భువనాని। మాయయా। ధేనుం। చ। పృశ్నిం। వృషభం। సుఽరేతసం। విశ్వాహా। శుక్రం। పయః। అస్య। ధుక్షత॥

సా॥భా॥ పిత్రోః-మాతాపిత్రోర్ద్యావాపృథివ్యోః, పుత్రః-పురుత్రాతాపుత్ర స్థానీయఆదిత్యః, పవిత్రవాన్-పావనరశ్మియుక్తః,ధీరః-ధీమాన్ సవహ్నిః - ఫలస్యవోఢాధారకఃసన్, మాయయా-ప్రజ్ఞయా స్వకీయయా, భువనాని-భూతజాతాని, పునాతి పావయతి. ప్రకాశ యతీత్యర్థః, కించ స ఏవపుత్రః, పృశ్నిం-శుక్లవర్ణాం, ధేనుం - ప్రీణయిత్రీం భూమిం, సురేతసం - శోభనసామర్థ్యం శోభనోదకం వా, వృషభం-సేక్తారంద్యులోకం చ మాయయాపునాతి, ప్రకాశయతీత్యర్థః। కదా। విశ్వాహా-సర్వాణ్యప్యహాని-సర్వకాలమిత్యర్థః। కించాస్య-ద్యులోకస్య, యద్వా ఇమం ద్యులోకం, శుక్రంపయః- దీప్తం పయః సదృశముదకం, ధుక్షత-దోగ్ధి, ఈ దృశోమహానుభావః ఆదిత్యస్త-యోః పుత్రఇతిద్యావాపృథివ్యోః స్తుతిః॥

సా॥బా॥అను॥ పిత్రోః = తల్లిదండ్రులగు ద్యావాపృథివీలక, పుత్రః = పుత్రస్థానములోనున్న ఆదిత్యుడు, పవిత్రవాన్ = పవిత్రమైన కిరణములు కలవాడు, దీరః = బుద్ధిమంతుడు, సవహ్నిః = ఫలమునిచ్చువాడు, ధారకుడు, మాయయా = తనయొక్క ప్రజ్ఞచేత, భువనాని = లోకములను, పునాతి = ప్రకాశింప చేయుచున్నాడు, ఇంకనూ పుత్రుడగు ఆ ఆదిత్యుడు, పృశ్నిం = తెల్లనివర్ణముగల, ధేనుం = సంతోషమును కలుగచేయు భూమిని, సురేతసం = శుభకరమగు జలమును, వృషభం = కురిపించు ద్యులోకమును (ఆకాశమును) తన ప్రజ్ఞచేత ప్రకాశింప చేయుచున్నాడు. ఎప్పుడు? విశ్వాహా = అన్ని కాలములందు, ఇంకనూ అస్య = ఈ ద్యులోకమునకు, శుక్రం పయః = ప్రకాశించు పాలతో సమానమగు ఉదకమును, దుక్షత = వర్షించుచున్నాడు, పితుకుచున్నాడు. ఇటువంటి మహానుభావుడు ఆదిత్యుడు ద్యావాపృథివీల పుత్రుడని స్తుతించబడుచున్నది.

వ్యా॥ వి॥ పిత్రోః = మాతా పితరులగు ద్యావా పృథివీలకు "పితామాత్రా" అను పాణినిసూత్రముచే (1-2-70) ఏకశేషసమాసము వలన పితృశబ్దము మిగిలినది. ధుక్షత = దోగ్ధి (పితుకుచున్నాడు) దుహ ప్రపూరణే అనుధాతువునకు వైదికలుజ్ లకారములో "శలఇగుపధాదనిటక్సః" అనుపాణినిసూత్రముచే (3-1-45) "చ్లి" అనుదానికి "క్స" అను ఆదేశము వచ్చెను.

సం॥పా॥ 4) అయందేవానామపసామపస్తమో
యోజజాన రోదసీ విశ్వశంభువా॥
వియోమమేరజసీ సుక్రతూయయా
జరేభిః స్కంభనేభిః సమానృచే॥

ప॥ పా॥ అయం। దేవానాం। అపసాం। అపఃఽతమః। యః।
జజాన। రోదసీ। ఇతి। విశ్వఽశంభువా। వి। యః।
మమే। రజసీఇతి। సుక్రతుఽయయా। అజరేభిః।
స్కంభనేభిః। సం। ఆనృచే॥

సా॥ భా॥ అయందేవానాం మధ్యేదేవతమః, అపసామపస్తమః కర్మవతాం మధ్యే ప్రకృష్టకర్మా, అయమిత్యుక్తంకఇత్యాహ, యః దేవః, విశ్వశంభువా-సర్వ ప్రకారేణభూతానాం సుఖస్య భావయిత్ర్యౌ రోదసీ - ద్యావాపృథివ్యౌమహానుభావే, జజాన - ఉత్పాది తవాన్, అపితుయః దేవః, రజసే-రంజనాత్మికే ద్యావాపృథివ్యౌ, వియమే-విశేషేణ పరిచ్ఛినత్తి.క్వింస్వోపభోగాయ-నేత్యాహ। సుక్రతూయయా-శోభన కర్మేచ్ఛయా, యేనకర్మణా ప్రాణినాం సుఖం సంభవతి. తాదృక్కర్మేచ్ఛయా, సుక్రతూయయా-ఉక్తేననిమిత్తేనేమేద్యావా-పృథివ్యౌ, అజరేభిః-అజీర్ణైః దృఢతరైః, స్కంభనేభిః గతి ప్రతిబంధ సాధనైః శంకుభిః, సమానృచే-సమ్యక్ సర్వతః పూజితవాన్, స్థాపిత వానిత్యర్థః॥

సా॥భా॥అను॥ అయం దేవానాం దేవతమః = ఇతడు దేవతల మధ్యలో శ్రేష్ఠుడు, అపసామపస్తమః = కర్మలు చేయువారిమధ్యలో ఉత్తమ కర్మాచరణుడు అని చెప్పబడినది. ఇతడు అనగా ఎవరు? యఃదేవః = ఏ దేవుడు, విశ్వశంభువా=సకలవిధములుగా ప్రాణులకు సుఖమును కలుగజేయు, రోదసీ = మహానుభావులగు ద్యావాపృథివీ-లను, జజాన = ఉత్పాదనచేసెను. ఇంకనూ రజసీ=రంజనాత్మకము లగు ద్యావాపృథివీలను, వియమే = విశేషముగా కొలిచెను. తన సుఖముకొరకేకాదు, సుక్రతూయయా = శుభకర్మలు చేయవలెనని

కోరికతో (ఏ కర్మవలన ప్రాణులకు సుఖము చేకూరునో అటువంటి కర్మచేయవలెనని) సుప్రకతూయుయా = చెప్పబడిన కారణముచేత ఈ ద్యావాపృథివీలను, అజరేభిః = జీర్ణముకాని దృఢతరములగు, స్కంద నేభిః = గమనమును అడ్డగించు సాధనములచేత (శంకువులచేత) సమాన్మృచే = చక్కగా పూజించెను, స్థాపించెనని అర్థము.

వ్యా॥ వి॥ అపసామపస్తమః = కర్మలుచేయు వారిలో శ్రేష్ఠ-కర్మాచరణుడు (అప ఇతి కర్మనామ) రోదసీ, రజసీ-అను పదములు ప్రగృహ్యసంజ్ఞను పొందినవి గనుక పదపాఠములో ఇతి అనునది ఏర్పడెను. (రోదసీ ఇతి। రజసీఇతి) సమాన్మృచే=చక్కగాపూజించెను, స్థాపించెను. "ఋచస్తుతౌ" అనుదాతువునకు లిట్ లకారమునందు రేఫ సామాన్యమువలన హలోత్వముకలది కావున దానికి "నుట్ ద్విహలః" అని అభ్యాసమునకు నుడాగమము వచ్చెను. సమ్ఆజ్ అను ఉపసర్గ ద్వయపూర్వకముగా ఋచస్తుతౌ ధాతువునకు లిట్ ప్రథమపురుషైక-వచనము.

సం॥పా॥ ౫) తేనోగృణానే మహినీ మహిశ్రవః క్షత్రం
ద్యావాపృథివీ దాసథో బృహత్।
యేనాభికృష్టీస్తత నామవిశ్వహా
పనాయ్యమోజ్ అస్మేసమిన్వతమ్॥

ప॥ పా॥ తే ఇతి। నః। గృణానేఇతి।మహినీఇతి। మహి। శ్రవః। క్షత్రం। ద్యావాపృథివీ ఇతి ధాసథః। బృహత్। యేన। అభి।కృష్టీః। తతనామ। విశ్వహా। పనాయ్యం ఓజః। అస్మే ఇతి। సం। ఇన్వతం॥

సా॥ భా॥ తే-ప్రసిద్ధే, హే ద్యావాపృథివీ - ద్యావాపృథివ్యౌ, గృణానే - అస్మాభిః స్తూయమానేసత్యౌ, మహి - మహదతిప్రభూతం, శ్రవః-సర్వత్రప్రసిద్ధమన్నం, సర్వత్రశ్రూయమాణాం కీర్తింవా- నః-అస్మభ్యం,ధాసథః-ధత్తం। తథా బృహత్-అతిప్రభూతం,క్షత్రం- బలం, ధాసథః। తదేవ విశేష్యతే। యేన - అన్నబలేన, విశ్వహా-సర్వే ష్వప్యహఃసు, కృష్టీః-పుత్రాదిరూపాః ప్రజాః, అభితతనామ-అభితో విస్తారయామ, కించ పనాయ్యం-స్తుత్యం, ఓజః-శరీరబలం, అస్మే, అస్మాసు, సమ్యగిన్వతం-వ్యాప్నుతం, ప్రవర్ధయత మిత్యర్థః॥

సా॥భా॥అను॥ తే = ఆ ప్రసిద్ధులగు, హే ద్యావాపృథివీ = ఓ ద్యావాపృథివీ దేవతలారా! గృణానే = మాచే స్తుతింపబడు మీరు, మహి = సమృద్ధిగా, శ్రవః = అన్నిచోట్ల ప్రసిద్దమగు అన్నమును అన్నిచోట్ల వినబడు కీర్తిని, నః = మాకు, ధాసథః=కలుగజేయుదురు గాక! అట్లే బృహత్ = అధికముగా, క్షత్రం = బలమును, ధాసథః = కలుగజేయుదురుగాక! యేన = అన్నమువలన కలుగు బలముచేత, విశ్వహా = సర్వకాలముఅందు, కృష్టీః = పుత్రాదిరూపమగు సంతాన- మును, అభితతనామ = విస్తరించెదముగాక! ఇంకనూ పనాయ్యం= స్తుతించదగు, ఓజః = శరీరబలము, అస్మే = మాయందు, సమీ- న్వతం = వృద్ధిని పొందుగాక!

వ్యా॥వి॥ తే గృగానే మహినీ ద్యావాపృదివీ అస్మే మొదలగు పదములు-ఈ దూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్ (1-1-11) అను పాణిని సూత్రముచేత ప్రగృహ్య సంజ్ఞను పొందును, అందువలన పద- పాఠములో ఇతి అనునది ఏర్పడెను. తే ఇతి। గృణానేఇతి। మహినీ ఇతి। ద్యావాపృథివీఇతి। అస్మే ఇతి। దాసథః = ధారణార్ధకధాధాతువు

నకు లేట్ లకారమునందు అడాగమము = సిబ్బహులం లేటి అను సూత్రముచే (3-4-34) సిప్ ప్రత్యయము థస్ ప్రత్యయము రాగా మధ్యమపురుష ద్వివచన రూపమేర్పడెను. కృష్టిః = పుత్రాదిరూపమగు సంతానమును అని అర్థము. కృష్టయ ఇతి మనుష్యనామ కృష్ట యశ్చర్షణయ ఇతితన్నామనుపాఠాత్.

—ం—

## 5) విష్ణుసూక్తము

సం॥పా॥ 1) విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచం యః
పార్థివాని విమమే రజాంసి యో అస్కభాయ
దుత్తరంసధస్థం విచక్రమాణ
స్త్రేధోరుగాయః॥

ప॥ పా॥ విష్ణోః। ను। కమ్। వీర్యాణి। ప్రవోచమ్। యః।
పార్థివాని। వి౽యమే। రజాంసి। యః। అస్కభా-
యత్। ఉత్౽తరమ్। సధ౽స్థమ్। వి౽చక్రమాణః।
త్రేధా। ఉరు౽గాయః॥

సా॥ భా॥ హే నరాః! విష్ణోః-వ్యాపనశీలస్యదేవస్య, వీర్యాణి-వీరకర్మాణి, నుకమ్-అతిశీఘ్రం, ప్రవోచమ్-ప్రబ్రవీమి, యః-విష్ణుః పార్థివాని-పృథివీసంబంధీని, రజాంసి-రంజనాత్మకానిక్షిత్యాది లోకా-త్రయాభిమానీన్యగ్ని వాయ్వాదిత్య రూపాణి రజాంసి, విమమే - విశేషేణనిర్మయేకించయశ్చ విష్ణుః ఉత్తరమ్-ఉద్గతతరయతి విస్తీర్ణం, సధస్థం - సహస్థానం లోకత్రయా శ్రయభూతమంతరిక్షం, అస్క-భాయత్-తేషామాధారత్వేన స్తభితవాన్, నిర్మితవానిత్యర్థః। అనేనాంతరి క్షాకృతం లోకత్రయమపి సృష్టవానిత్యుక్తరభవతి। కింకుర్వన్! త్రేధా-విచక్రమాణః - త్రిప్రకారం స్వసృష్టాలల్లోకాన్ వివిధం క్రమమాణః అతఏవోరుగాయః - ఉరుభిర్మహద్భిర్గీయమానః అతిప్రభూతంగీయ - మానోవా। య ఏవం కృతవాన్ తాదృశస్యవిష్ణోర్వీర్యాణి ప్రవోచమ్.

సా॥ భా॥ అను॥ ఓ నరులారా! విష్ణోః = వ్యాపించుస్వభావము కలిగిన దేవుని, వీర్యాణి = వీరకర్మలను, నుకమ్ = మిక్కిలిశీఘ్రముగ

ప్రవోచమ్ = గొప్పగా చెప్పుచున్నాను. యః=ఏ విష్ణువు, పార్థివాని= పృథివీ సంబంధమగు, రజాంసి = రంజనాత్మకములు పృథివ్యాదిలోక త్రయములకు (భూమ్యాకాశస్వర్గములకు అభిమానులు అగ్నివాయ్వా దిత్యరూపులైన రజస్సులను) విమమే = విశేషముగా నిర్మించెను, కించ = ఇంకనూ, యః విష్ణుః = ఏ విష్ణువు, ఉత్తరమ్ = మిక్కిలి విశాలమగు, సదస్థం = లోకత్రయమునకు ఆశ్రయభూతమగు ఆకాశ- మును, అస్కభాయత్ = వాటికి ఆధారముగా నిర్మించెను. అందువలన అంతరిక్షము నాశ్రయించిన ముల్లోకములనుకూడా సృష్టించెను అని చెప్పబడుచున్నది. త్రేధావిచక్రమాణః = మూడు ప్రకారములు తనచే సృష్టించబడిన లోకములను బహువిధములుగా ఆక్రమించు- చున్నాడు. అందువలననే ఉరుగాయః = గొప్పవారిచేత స్తోత్రము చేయబడువాడు లేక మిక్కిలి స్తోత్రము చేయబడువాడు, అటువంటి విష్ణువుయొక్క వీరకర్మలను స్తుతించుచున్నాను.

వ్యా॥వి॥ పార్థివాని రజాంసీ=సాయణాచార్యుల అభిప్రాయము "అగ్నివాయ్వాదిత్యులచేత ఆక్రమించబడిన లోకములు (ముల్లోక- ములు) Griffith మరియూ Macdonell అభిప్రాయము ప్రకారము భూలోకప్రదేశములని అర్థము. Macdonell పార్థివాని, రజాంసి పదములను విడిగా గ్రహించి భూమి వాయువు అని అర్థములను చెప్పెను. ఉత్తరమ్‌సదస్థమ్ - ఊర్ధ్వలోకము స్వర్గము అధోలోకము భూమి శ్రీ సాయణుల అభిప్రాయము ప్రకారము ఆకాశముతోకూడిన మూడు ఊర్ధ్వలోకములని అర్థము. యాస్కవచనమును ప్రమాణ- ముగా గ్రహించి "దైవభక్తులలోకము" అని అర్థమునుకూడా స్వీక- రించెను. ఉరుగాయః = యాస్కాచార్యుల ప్రకారము విశాలమైన గమనము కలవాడని అర్థము. (నిరుక్తం 2-7) సాయణుల ప్రకారము

"మిక్కిలి స్తుతించబడినవాడు" అని అర్థము. Griffith మరియూ Macdonell యాస్కుల అభిప్రాయమును సమర్థించిరి.

స్వ॥ వి॥ కమ్ = ఉదాత్తస్వరమును పొందలేదు. కమ్ ఎల్లప్పుడూ స్వతంత్రంగా ప్రయోగించబడక ను - సు - హిఅను అవ్యయములతో కలిపి ప్రయోగించబడి "అంగీకారము - సంతోషము - నిజము" అను అర్థములను బోధించును. వీర్యాణి = వీరవిక్రాన్తౌ"అను ధాతువునకు "అచోయత్" అనుసూత్రముచే యత్ ప్రత్యయము వచ్చెను. ప్రత్యయము తిత్ అగుటవలన ర్యా అను అక్షరము స్వరితమును పొందినది. (తిత్స్వరితమ్ 6-1-185 పా.సూ.) వోచమ్= వచపరిభాషణే అనుధాతువునకు లుఙ్ ఉత్తమ పురుషైకవచనము. పాదము లేక వాక్య ప్రారంభములోలేని క్రియ ఉదాత్తమును పొందదు. (అఙ్జతిఙః 8-1-28 పా.సూ.) అస్కభాయత్=సృష్టించుట అను అర్థముగల "స్కభ" ధాతువునకు లఙ్ ప్రథమపురుషైకవచనము యచ్ఛబ్దముతో ప్రారంభింపబడెను. గనుక ఉదాత్తమును పొందినది

సం॥పా॥ 2) ప్రతద్విష్ణుః స్తవతే వీర్యేణ
మృగోన భీమఃకుచరో గిరిష్ఠాః।
యస్యోరుషు త్రిషు విక్రమణే
ష్వధిక్షియన్తి భువనాని విశ్వా॥

ప॥ పా॥ ప్ర। తత్। విష్ణుః। స్తవతే। వీర్యేణ। మృగః। న। భీమః। కుచరః। గిరిఽస్థాః। యస్య। ఉరుషు। త్రిషు। విఽక్రమణేషు। అధిఽక్షియన్తి। భువనాని। విశ్వా॥

సా॥ భా॥ సమహానుభావః, వీర్యేణ - స్వకీయేన వీరకర్మణా, స్తవతే-స్తూయతే సర్వైః, వీర్యేణస్తూయమానత్వేదృష్టాన్తః మృగోన

సింహాదిరివ, యథాస్వవిరోధినోమృగయితాసింహః, భీమః-భీతిజనకః, కుచరః-కుత్సితహింసాదికర్తాదుర్గమ ప్రదేశగంతావా, గిరిష్ఠాః-పర్వతా ద్యున్నత ప్రదేశస్థాయీ సర్వైస్స్తూయతే। మృగః-అన్వేష్టా శత్రూణాం భీమః-భయానకః సర్వేషాం భీత్యుపాదానభూతః। పరమేశ్వరాద్భీతిః" భీషాస్మాద్వాతః పవతే" (తై.ఆ. 8-8-1) ఇత్యాది శ్రుతిషు ప్రసిద్ధా। కించ కుచరః - శత్రువధాది కుత్సితకర్మకర్తా, కుషుసర్వాసుభూమిషు లోకత్రయే సంచారీవాతథా, గిరిష్ఠా - గిరివదుచ్ఛ్రిత లోకస్థాయీ, యద్వాగిరిమంత్రాది రూపాయాం వాచి సర్వదా వర్తమానః, ఈదృశో౽యంస్వమహిమ్నా స్తూయతే। కించయస్య విష్ణోః, ఉరుషు - విస్తీర్ణేషు త్రిసంఖ్యాకేషు, విక్రమణేషు - పాదప్రక్షేపేషు, విశ్వా - సర్వాణి భువనాని భూతజాతాని, అధిక్షియంతి-ఆశ్రితనివసంతి స విష్ణుః స్తూయతే॥

సా॥ భా॥ అను॥ ఆ మహానుభావుడు, వీర్యేణ = తనయొక్క వీరకర్మలచేత, స్తవతే = అందరిచేత స్తుతించబడుచున్నాడు. దృష్టాంతము, మృగోన = సింహాదులవలె ఎట్లైతే సింహము తన విరోధులను వేటాడునో, భీమః=వాటికి బయమును కలుగచేయునో, అట్లుకుచరః= కుత్సితమగు హింసాకార్యములు చేయువాడు లేక కఠిన ప్రదేశములలో సంచరించువాడు, గిరిష్ఠాః=పర్వతము మొదలగు ఉన్నతప్రదేశము లలో ఉండిఅందరిచేతస్తుతించబడుచున్నాడు,మృగః-శత్రువులను అన్వే షించువాడు,భీమః-అందరికీభయమునుకల్గుగచేయువాడు పరమాత్మని వలన బయము శృతులలోకూడా ప్రసిద్ధము "భీషాస్మాద్వాతః పవతే" (తై.ఆ.8-8-1)ఇంకనూకుచరః-శత్రువధాదికుత్సితకర్మలనుచేయువాడు కుషు=భూమండలమంతా ముల్లోకములలో సంచరించువాడు, గిరిష్ఠాః= గిరివలె ఉన్నత లోకములలో ఉండువాడులేకగిరి = మన్త్రరూపమగు

వాక్కునందు ఎల్లప్పుడూ ఉండువాడు, ఇటువంటి విష్ణువు తనమహిమ చేత స్తుతించబడుచున్నాడు, యస్య = ఏ విష్ణువుయొక్క, ఉరుషు = విశాలములగు మూడు సంఖ్యలతోకూడిన, విక్రమణేషు = పాద ప్రక్షే-పములందు, విశ్వా = అన్ని, భువనాని = భూతజాతములు, అధి-క్షియన్తి = ఆశ్రయించి నివసించుచున్నవో ఆ విష్ణువునుగూర్చి స్తోత్రము వివరింపబడుచున్నది.

వ్యా॥వి॥స్తవతే"ష్టుఞ్ స్తుతౌ" అనుధాతువునకుకర్మణి ప్రయోగము నందు వ్యత్యయముగా శప్ విధించబడుటవలన రూపము సిద్ధించెను. లట్ ప్రథమపురుషైకవచన, మృగః=యాస్కనిర్వచనము ప్రకారము గమనార్ధక మృష్‌దాతువునుండి ఉత్పన్నమైనది. (మృగోమార్ష్టేర్గతి కర్మణః నిరుక్తం I-2) మొట్టమొదట మృగశబ్దము అడవి జంతువుల విషయములో ప్రయోగించబడి తరువాత సింహమునకు పరిమితం అయ్యెను, భీమః - ఞిభీభయే అనుదాతువునుండి నిష్పన్నమైన రూపము. (భిభ్యత్యస్మాత్ - నిరుక్తం I-20) కుచరః = ఈ పదము నకు యాస్కులవారు రెండు వివరణలు ఇచ్చిరి. 1) శతృవధాది హింసాకర్మలను చేయువాడు (కుత్సితకర్మ నిరుక్త I-20) 2) అన్ని ప్రదేశములందు సంచరించువాడు (క్వాయంనచరతీతి నిరుక్తంI-20) సాయణులు యాస్కుని అభిప్రాయమునే సమర్ధించిరి. కుచరః అను నది పదపాఠమునందు విభాగము చేయబడలేదు. "కు" అనునది స్వతంత్ర పదముకాదు కనుక గిరిష్ఠాః = గిరివలె ఉన్నతమైన ప్రదేశమునందుండువాడు లేక మన్త్రాదిరూపములగు వాక్కులయందు ఎల్లప్పుడూ వసించువాడు అని సాయణాచార్యుల అభిప్రాయము. Griffith అభిప్రాయము పర్వతములందు ఊరక సంచరించువాడు

పర్వతముపై తరచూ సంచరించువాడు అని Macdonell అభి-
ప్రాయము.

స్వ॥వి॥ గిరిష్ఠాః అనునది తత్పురుషసమాసముకాపున ఉత్తరపదమునకు ఉదాత్తమువచ్చెను. సంహితాపాఠములో ఉత్తరపదమునందు వచ్చిన మార్పు అంతర్గతసంధివలన ఏర్పడినది. ఆమార్పు పదపాఠములో పదము విభాగము చేయుటవలన ఉండదు. అధిక్షియన్తి = అధిపూర్వకక్షి నివాసే అనుధాతువునకు లట్ ప్రథమపురుషబహువచనము పూర్వ పదము ఉదాత్తస్వరమును పొందినది. యచ్ఛబ్దముతో ప్రారంభించ బడినది గనుక.

సం॥పా॥ 3) ప్రవిష్ణవేశూషమేతుమన్మ గిరిక్షిత
ఉరుగాయాయవృష్ణే।
యఇదం దీర్ఘం ప్రయతంసదస్థ
మేకోవిమమే త్రిభిర్విత్పదేభిః॥

ప॥ పా॥ ప్ర। విష్ణవే। శూషమ్। ఏతు। మన్మ। గిరిఽక్షితే। ఉరుఽగాయాయ। వృష్ణే। యః। ఇదమ్। దీర్ఘమ్। ప్రఽయతమ్। సధఽస్థం। ఏకః। విఽమమే। త్రిఽభిః। ఇత్। పదేభిః॥

సా॥ భా॥ విష్ణవే-సర్వవ్యాపకాయ, శూషం-అస్మత్కృత్యాది జన్యం బలంమహత్త్వం, మన్మ-మననం స్తోత్రం మననీయం శూషం బలంవా విష్ణుమేతు ప్రాప్నోతు। కీదృశాయ। గిరిక్షితే - వాచి, గిరి వదున్నత ప్రదేశేవాతిష్ఠతే, ఉరుగాయాయ - బహుభిర్గీయమానాయ। వృష్ణే-వర్షిత్రేకామానాం, ఏవం మహానుభావం శూషం ప్రాప్నోతు, కోఽస్య విశేష ఇత్యుచ్యతే। యో విష్ణుః ఇదం-ప్రసిద్ధం దృశ్య-

మానం, దీర్ఘం-అతివిస్తృతం, ప్రయతం-నియతం, సధస్థం - సహస్థానంలోకత్రయం, ఏకఇత్-ఏకఏవాద్వితీయః సన్, త్రిభిః పదేభిః పాదైః, విమమే-విశేషేణ నిర్మితవాన్॥

సా॥ భా॥ అను॥ విష్ణవే = సర్వవ్యాపకునికి, శూషమ్ = మన చేత చేయబడ్డ కర్మలవలన కలిగిన బలము గొప్పతనము, మన్మ = స్తోత్రము, బలము విష్ణువును పొందుగాక! ఎటువంటి విష్ణువునకు గిరిక్షితే = వాక్కులందు, గిరివలె ఉన్నత ప్రదేశమునందున్నటువంటి ఉరుగాయాయ = చాలామందిచేత స్తుతింపబడుచున్న, వృష్ణే = కోరికలను తీర్చువానికి, ఇటువంటి మహానుభావునికి శక్తి కలుగుగాక! యః = ఏ విష్ణువు, ఇదం = ప్రసిద్ధముగా కనబడు, దీర్ఘమ్ = మిక్కిలి విశాలమగు, ప్రయతం = నియతమగు, సధస్థం = ముల్లోకములను, ఏకః ఇత్ = ఒక్కడే అద్వితీయుడుగా, త్రిభిః పదేభిః = మూడు అడుగులతో, విమమే = విశేషముగా కొలిచెను.

వ్యా॥ వి॥ గిరిఒక్షితే=ఇచ్చట సాయణాచార్యుల అభిప్రాయ మేమనగా-వాక్కులందు లేక గిరివలె ఉన్నతమగు ప్రదేశము నందుండువాడు అను రెండర్థములతో మొదటి దానికే ప్రాధాన్యత నిచ్చిరి. క్షినివాసే అనుధాతువునకు నామవాచకమును రూపొందించు తి ప్రత్యయముచేయగా గతి, భక్తిశబ్దములవలె క్షితిః అని ఏర్పడెను. క్షితే అనునది చతుర్థ్యేక వచనరూపము. ప్రఒయతమ్ = ప్ర అను ఉపసర్గపూర్వకముగా మిక్కిలి విశాలమను అర్థముగల యమధాతువు యొక్క భూతకాలికరూపము. ఏకః = విష్ణువు ఒక్కడే ఇతరుల సహాయమపేక్షించకుండా ముల్లోకములను కొలిచెను అని సాయణాభిప్రాయము. Macdonell అభిమతము ప్రకారము ఏకః మరియూ

త్రిభిః అనుపదములు ఒకదానితో ఒకటి సంబంధము కల్గి ఉన్నవి, "ఒక్కడే మూడు పాదములతో" అని అనువాదము.

స్వ॥వి॥ గిరిఽక్షితే - అనునది తత్పురుషసమాసము, ఉత్తర పదమునకు ఉదాత్తము సిద్ధించెను.

సం॥ పా॥ 4) యస్య త్రీ పూర్ణామధునాపదాన్య క్షీయమాణా స్వధయామదన్తి। య ఉ త్రిధాతు పృదివీ మతద్యామేకోదాధార భువనాని విశ్వా॥

ప॥ పా॥ యస్య। త్రీ। పూర్ణా॥ మదునా। పదాని। అక్షీయ-మాణా। స్వధయా। మదన్తి। యః। ఊఇతి। త్రిఽ-ధాతు। పృథివీం। ఉత। ద్యామ్। ఏకః। దాధార। భువనాని। విశ్వా॥

సా॥ భా॥ యస్య విష్ణోః, మధునా-మధురేణ దివ్యేనామృతేన పూర్ణా-పూర్ణాని త్రీణి, పదాని-పాద ప్రక్షిపణాని, అక్షీయమాణా-అక్షయ మాణాని, స్వధయా-అన్నేన, మదంతి-తదాశ్రితజనాన్మాదయంతి, య ఉ-య ఏవ, పృథివీం-ప్రఖ్యాతాం భూమిం, ద్యాముత - ద్యోత నాత్మకమన్తరిక్షం చ, విశ్వభువనాని- సర్వాణిభూతజాతాని, చతుర్దశ లోకాంశ్చ। త్రిధాతు-త్రయాణాంధా తూనాం సమాహారస్త్రిధాతు - పృదివ్యప్తేజోరూపధాతు త్రయ విశిష్టం యధాభవతి తథా, దాధార - ధృతవాన్ ఉత్పాదితవానిత్యర్థః॥ యద్వా-త్రిధాతు కాలత్రయం గుణత్రయం వాదాధారేత్యన్వయః

సా॥ భా॥ అను॥ ఏ విష్ణువుయొక్క, మధునా = మధురమగు దివ్యమైన అమృతముచేత, పూర్ణా=పరిపూర్ణములైన మూడు, పదాని= అడుగులు, అక్షీయమాగా = నాశనము లేనటువంటివి, స్వధయా = అన్నముచేత, మదన్తి = ఆశ్రితజనులను తృప్తిపరుచుచున్నవి, య

ఉ = ఎవరైతే, పృథివీం = ప్రసిద్ధమగు భూమిని, ద్యాముత = ద్యోతనాత్మకమగు ఆకాశమును, విశ్వా భువనాని = సమస్త ప్రాణకోటిని (పదునాల్గులోకములను) త్రయాణాం ధాతూనాం సమాహార త్రిధాతు= భూమి-జలము-తేజోరూపమగు మూడు మహాభూతములతోకూడినట్లుగా లోకములను ఏకః-ఒక్కడే, దాధార-ధరించెను, సృష్టించెనని అర్థము లేక త్రిధాతు = కాలత్రయమును, గుణత్రయమును ధరించెను.

వ్యా॥ వి॥ అక్షీయమాణా = క్షి క్షయే అనుధాతువునకు కర్మణి ప్రయోగమునందు రూపము. తరువాత నఞ్ తత్పురుషసమాసము ఏర్పడెను. స్వధయా = స్వధా అనుపదమునకు పలు అర్థములు నిఘంటువునందు పేర్కొనబడినవి-జలము (I-12-97) అన్నము (II-7-17) ద్యావాపథివీలు (II-30-1) సాయణాచార్యులు అన్నము అను అర్థమును అంగీకరించిరి. Macdonell స్వధా అనగా బ్రహ్మానందము అను అర్థమును వివరించెను. NWD ఆత్మశక్తి అను అర్థమునందు స్వీకరించెను. మదంతి = "మదతృప్తౌ" అనుధాతువునకు వర్తమాన కాలిక ప్రథమపురుషబహువచనము. త్రిధాతు = దీనిని సాయణాచార్యులు ఇట్లు వివరించిరి. త్రయాణాం దాతునాం సమాహారః త్రిధాతు, పృథివ్యప్తేజోరూపధాతు త్రయముతోకూడినది. Wilson మూడు ప్రకృతి శక్తులనీ, Griffith - మూడు పర్యాయములనీ, Macdonell మూడు ప్రకారముల మార్గమని వివరించిరి. Macdonell త్రిదాతు అనుదానిని త్రేధాతో సమానముగా భావించెను. దాధారధృఞ్ ధరణే అనుదాతువునకు లిట్ ప్రథమపురుషైకవచనము. మొదటి అక్షరము సాధారణముగా దీర్ఘమును పొందును. పదపాఠములోకూడా హ్రస్వమును పొందలేదు.

స్వ॥ వి॥ అక్షీయమాణా = ఇది నఞ్ తత్పురుషసమాసము

కావున పూర్వపదమునకు ఉదాత్తము వచ్చెను, మఱియు పద-పాఠములో పూర్వపదము అవగ్రహముద్వారా వేరు చేయబడలేదు. మదంతి = ఇచ్చట యచ్ఛబ్దముతో వాక్య ప్రారంభము గనుక ఉదాత్తము ఏర్పడినది. దాధార = ఇచ్చటకూడా వాక్యప్రారంభము యచ్ఛబ్దముతో చేయబడినది గనుక ఉదాత్తము ఏర్పడినది.

సం॥పా॥ 5) తదస్య ప్రియమభిపాథో అశ్యాం
నరోయత్ర దేవయవోమదన్తి।
ఉరుక్రమస్యసంహిబన్ధురిత్థా
విష్ణోః పదేపరమే మధ్వ ఉత్సః॥

ప॥ పా॥ తత్। అస్య। ప్రియమ్। అభి। పాథః। అశ్యామ్। నరః। యత్ర। దేవ౽యవః। మదన్తి। ఉరు౽-క్రమస్య। సః। హి। బన్ధుః। ఇత్థా। విష్ణోః। పదే। పరమే। మధ్వః। ఉత్సః॥

సా॥భా॥ అస్య-మహతో విష్ణోః, ప్రియం-ప్రియభూతం, తత్-సర్వైఃసేవ్యత్వేన ప్రసిద్ధం, పాథః-అంతరిక్షం, అవినశ్వరం బ్రహ్మలోకమిత్యర్థః। అశ్యాం-వ్యాప్నుయాం, యత్రస్థానే, దేవయవః-దేవం దేవందోతనస్యభావం విష్ణుమాత్మన ఇచ్ఛంతో యజ్ఞదానాదిభిఃప్రాప్తుమిచ్ఛంతః, నరః మదన్తి-తృప్తిమనుభవంతి। తదశ్యామిత్యన్వయః। పునరపితదేవవిశేష్యతే। ఉరుక్రమస్య-అత్యధికం సర్వం జగదాక్రమమాణస్యతత్తదాత్మనా, అతఏవ విష్ణోః-వ్యాపకస్య పరమేశ్వరస్య, పరమే-ఉత్కృష్టే, నిరతిశయే కేవలసుఖాత్మకే, పదే-స్థానే, మధ్వః-మధురస్య, ఉత్సః - నిష్యందోవర్తతే। యత్రక్షుత్తృష్ణాజరామరణపునరావర్త్యాది భయం నాస్తిసంకల్పమాత్రేణావృతకుల్యాదిభోగాః

ప్రాప్యంతే తాదృశమిత్యర్థః] ఇత్థా-ఇత్థముక్త ప్రకారేణ, సహిబన్ధుః-సఖిలు సర్వేషాం సుకృతినాం బంధుభూతో హితకరోవాతస్యపదం ప్రాప్తవతాం న పునరావృత్తిః॥

సా॥ భా॥ అను॥ అస్య = మహిమాన్వితుడగు విష్ణువునకు, ప్రియం = ప్రియమగు, తత్ = అందరిచేత సేవించుటవలన ప్రసిద్ధ మగు, పాథః=అంతరిక్షము (వినాశములేని బ్రహ్మలోకము)అశ్యామ్= పొందెదనుగాక! యత్ర = ఏ ప్రదేశమందు, దేవయవః=ప్రకాశించు స్వభావముకల విష్ణువును కోరువాడు, (యజ్ఞదానాదులచేత పొందవలె-నని కోరికగల) నరః = మనుష్యులు, మదన్తి=తృప్తిని అనుభవించు చున్నారో అటువంటి లోకమును పొందెదను, ఉరుక్రమస్య = చాలా భాగము జగత్తుని ఆయా ఆత్మలుగా ఆక్రమించుచున్న, విష్ణోః = వ్యాపకుడగు పరమేశ్వరునికి, పరమే = శ్రేష్ఠమగు (గొప్పదగు) పదే = స్థానమందు, మధ్వః ఉత్సః అమృతతుల్యమగు ప్రవాహము కలదు. (ఎచ్చటైతే ఆకలిదప్పులు, జరామరణ పునరావృత్యాది భయములేదో సంకల్పమాత్రముగా అమృతకుల్యాదిభోగములు పొంద బడుచున్నవో) దానికంటె గొప్పదగు స్థానములేదు, ఇత్థా = ఇట్లు చెప్పబడిన ప్రకారము, సహిబన్ధుః=ఆ విష్ణువు పుణ్యముచేసిన వారికి హితకరుడు, బంధువు ఆయన స్థానమును పొందిన వారికి పునర్జన్మ ఉండదు.

వ్యా॥వి॥ యాస్కాచార్యులు పాథశబ్దమునకు పలువిధములుగా నిర్వచనములు చేసిరి. అన్తరిక్షము, ఉదకము, అన్నము, పాథః అన్తరిక్షమ్। ఉదకమపి। పాథఉచ్యతే। అన్నమపిపాథః ఉచ్యతే (నిరుక్తం 6-7) సాయణులు-బ్రహ్మలోకమని, Wilson - మార్గమని,

Griffith - వనము Macdonell - రాజ్యమనివివరించిరి. దేవయవః = ప్రథమాబహువచనరూపము దేవయు = దేవుని పొందవలెనని కోరిక కల్గి తత్సంబన్ధ ప్రయత్నములు చేయుట, "యు" అనునది తద్ధిత ప్రత్యయము. ముఖ్యపదవినా క్రమించు లేక ఇచ్ఛను కల్గి ఉండుట అను అర్థములను తెలియజేయును. యాస్కుడు "యు" అనుదానిని నామవాచకమును తయారుచేయు ప్రత్యయముగా గ్రహించెను. (అధ్వర్యుః-నిరుక్తం I-8) ఇత్థా = ఇట్లు, నిజముగా, సత్యముగా అను అర్థములువ్యక్తము చేయబడుచున్నవి. ఉరుక్రమస్య సహిబన్ధురిత్థా= ఈ మంత్రవాక్యము పండితులచేత పలురకములుగా వ్యాఖ్యానము చేయబడినది. సాయణులు "ఉరుక్రమస్య" అనుదానిని "విష్ణోః" అనుదానితో మరియూ సహిబన్ధురిత్థా అనునది ఫలితముగ ఏర్పడిన వాక్యముగను స్వీకరించిరి. Wilson - సాయణాచార్యుల ననుసరిస్తూ సత్పురుషులకు హితకరుడు అని వివరించెను. Griffith విశాలమైన అంగలు (పాదప్రక్షేపములు) కలవాడుఅని వివరించెను. Macdonell కూడా ఇదే అభిప్రాయమును సమర్థించెను.

స్వ॥వి॥ ఉరుక్రమస్య = ఇది బహువ్రీహిసమాసము. పూర్వ పదము ఉకారముతో పూర్తి అగుటవలన ఉత్తరపదములోని వర్ణము- నకు ఉదాత్తము వచ్చెను.

సం॥పా॥ 6) తావాం వాస్తూన్యుశ్మసిగమధ్యై
యత్రగావోభూరిశృంగా అయాసః।
అత్రాహ తదురుగాయస్యవృష్ణః
పరమం పదమవ భాతిభూరి॥

ప॥ పా॥ తా। వాం। వాస్తూని। ఉశ్మసి। గమధ్యై। యత్ర। గావః। భూరిఽశృంగాః। అయాసః। అత్ర। అహ।

తత్। ఉరుఽగాయస్య। వృష్ణః। పరమమ్। పదమ్।
అవ। భాతి। భూరి॥

సా॥ భా॥ హే పత్నీ యజమానౌ, వాం-యుష్మదర్థం, తా - తానిగంతవ్యత్వేన ప్రసిద్ధాని, వాస్తూని-సుఖనివాసయోగ్యానిస్థానాని, గమధ్యై-యువయోర్గమనాయ, ఉశ్మసి - కామయామహే, తదర్థం విష్ణుం ప్రార్థయామ ఇత్యర్థః। యత్ర-యేషువాస్తుషు, గావః-రశ్మయః భూరిశృంగాః - అత్యంతోన్నత్యుపేతాః బహుభిరాశ్రయణీయావా, అయాసః-అయనాగంతారోఽతివిస్తృతాః,యద్వాగంతారఃఅతాదృశాః అత్యంతప్రకాశయుక్తా ఇత్యర్థః। అత్రాహ - అత్రఖలు వాస్త్వాధార భూతేద్యులోకే, ఉరుగాయస్య=బహుభిర్మహాత్మభిర్గాతవ్యస్యస్తుత్యస్య, వృష్ణః-కామానాం వర్షితుర్విష్ణోః తత్తాదృశం సర్వత్రపురాణాది షుగంతవ్యత్వేన ప్రసిద్ధం। పరమం-నిరతిశయం, పదం-స్థానం, భూరి-అతి ప్రభూతం, అవభాతి-స్వమహిమ్నా స్ఫురతి॥

సా॥ భా॥ అను॥ ఓ పత్నీ యజమానులారా! వాం = మీకొరకు తా = పొందుటకు ప్రసిద్ధములగు, వాస్తూని = సుఖనివాసయోగ్యములగు స్థానములను, గమధ్యై = మీ ఇద్దరి గమనముకొరకు, ఉశ్మసి= కోరుచున్నాము, దానికొరకు విష్ణువును ప్రార్థించుచున్నాము. యత్ర= ఏ స్థానములందు, గావః = కిరణములు, భూరిశృంగాః = మిక్కిలి ఉన్నతమైనవి, చాలమందిచేత ఆశ్రయించదగినవి, అయాసః = గమనము చేయువారు, మిక్కిలి ప్రకాశవంతులు, అత్రాహ = సుఖ నివాసస్థానములకు ఆధారభూతమగు స్వర్గలోకమునందు, ఉరుగాయస్య = బహుసంఖ్యాకులగు మహాత్ములచేత స్తుతించబడు, వృష్ణః = కోరికలను తీర్చు విష్ణువుయొక్క (పురాణాదులలోకూడా అందరిచేత పొందదగినదిగా ప్రసిద్ధమైనది) పరమం = చాలశ్రేష్ఠమగు, పదం =

స్థానము, భూరి = మిక్కిలి విశాలమైనదిగా, అవభాతి = తనమహిమ చేత స్ఫురించుచున్నది.

వ్యా॥ వి॥ వామ్ - అనుదానికి సాయణులు యాగము చేయు పత్నీ యాజమానులని, దీనికి గమధ్యై అనుపదముతో సంబంధ-మును చెప్పిరి. Griffith మరియూ Macdonell "వామ్" అనుదానికి ఇంద్ర విష్ణువులని ఈ పదమును "వాస్తూని" అనుదానితో అన్వయించి చెప్పిరి. ఉశ్మసి = ఇచ్ఛ అను అర్థముఁగల వశ్‌ధాతువునకు వర్తమాన కాలిక ఉత్తమ పురుషైకవచనము, వకారస్థానములో సంప్రసారణము వలన ఉకారము వచ్చెను. గమధ్యై = గముల్‌గతౌ అనుధాతువునకు ధ్యై ప్రత్యయము చేర్చగా చతుర్థీవిభక్తిలో అసమాపక క్రియార్థము గోచరించును. గావః = గోశబ్దమునకు ప్రథమాబహువచనము, యాస్కుల వారు సాయణులచేత గ్రహించబడిన "కిరణములు" అను అర్థమును, Roth-నక్షత్రములని, Griffith - మరియూ Macdonell -కిరణములని వివరించిరి. అయాసః = అయ అను శబ్దమునకు ప్రథమాబహు-వచనము, సాయణులు గమనము చేయువారు, మిక్కిలి విశాలమగు వారు లేక అత్యంత ప్రకాశముకలవారు అని వివరించిరి. Wilson "పెద్దగా వ్యాపింపచేయుట" అని Griffith మరియూ Macdonell "చురుకైన" అను అర్థమును బోధించిరి.

స్వ॥ వి॥ భూరిఽశృంగాః = ఇది బహువ్రీహిసమాసము, కావుననే పూర్వపదమునకు ఉదాత్తము వచ్చెను.

# 6) ద్యూతసూక్తము

సం॥ పా॥ ప్రావేపామాబృహతోమాదయన్తి
ప్రవాతేజాఇరిణేవర్వృతానాః।
సోమస్యేవ మౌ జవతస్య భక్షో
విభీదకోజాగృవిర్మహ్యమచ్ఛాన్॥

ప॥పా॥ ప్రావేపాః। మా। బృహతః। మాదయన్తి। ప్రవాతేఽజాః। ఇరిణే। వర్వృతానాః। సోమస్యఽఇవ। మౌజఽవతస్య। భక్షః। విఽభీదకః। జాగృవిః। మహ్యమ్। అచ్ఛాన్॥

సా॥భా॥ బృహతః - మహతోవిభీతకస్య ఫలత్వేనసంబంధినః, ప్రవాతేజాః- ప్రవణేదేశేజాతాః ఇరిణే-ఆస్ఫారే, వర్వృతానాః-ప్రవర్తమానాః ప్రావేపాః- ప్రవేపిణః కంపనశీలా అక్షాః, మా-మాం, మాదయన్తి-హర్షయన్తి. కించజాగృవిః. జయపరాజయయోర్హర్షశోకాభ్యాం కితవానాం జాగరణస్యకర్తా, విభీదకః-విబీతకవికారోఽక్షో, మహ్యం - మామ్, అచ్ఛాన్-అచచ్ఛదత్ అత్యర్థం మాదయతి, తత్రదృష్టాన్తః- సోమస్యేవ యథా సోమస్య।, మౌజవతస్య - ముజవతివర్వతేజాతః మౌజవతః తస్య। భక్షః - పానం, యజమానాన్ దేవాంశ్చ మాదయతి తద్వదిత్యర్థః।

సా॥ భా॥ అను॥ బృహతః = గొప్పదగు విభీతక ఫలమునకు సంబంధించినవి. ప్రవాతేజాః = ప్రవణదేశమునందు (చలిదేశము-నందు) జనించినవి. ఇరిణే = చదరంగమునందు, వర్వృతానాః =

ప్రవర్తించునవి. ప్రావేపాః = చలించు స్వభావముకల పాచికలు, మా = నన్ను, మాదయన్తి = సంతోష పెట్టుచున్నవి. ఇంకనూ, జాగృవిః = జయపరాజయములు హర్షశోకములద్వారా జూదరులను మేలుకొలుపు, విభీదకః = విభీదకవృక్షమునుండి తయారయినపాచిక, మహ్యం = నన్ను, అచ్ఛాన్ = మిక్కిలి ఆనందపరచుచున్నది. దృష్టాంతము=మౌజవతస్య = ముజవతి పర్వతమునందు ఉత్పన్న-మైన, సోమస్యేవ = సోమరసముయొక్క, భక్షః = పానము, యజ-మానులను, దేవతలను ఎట్లు తృప్తిపరచుచున్నదో అట్లు.

వ్యా॥ వి॥ ప్రావేపాః = ప్ర అను ఉపసర్గపూర్వకముగా వే పృకంపనే అనుధాతువునుండి నిష్పన్నమైన శబ్దముయొక్క ప్రథమా విభక్తి బహువచనరూపము. మాదయన్తి = మదహర్షే అనుధాతువు-నకు వర్తమానకాలిక ణిజన్తరూపము, ప్రథమపురుషబహువచనము. ప్రవాతేఽజాః = ప్రవణదేశమునందు ఉత్పన్నమైనవి. (గాలి అధికముగా ఉండు ప్రదేశమును ప్రవణదేశమందురు.) వర్వృ-తానాః = వృతువర్తనే అను ధాతువునుండి నిష్పన్నమైన రూపము, వర్తమానకాలిక ప్రథమా బహువచనము. అచ్ఛాన్ = దర్శనార్థక ఛందధాతువునకు లుఙ్ ప్రథమపురుషైకవచనము. సాయణులు దీనిని ఆనందపరచుట అను అర్థమునందు గ్రహించిరి.

స్వ॥వి॥ ప్రవాతేఽజాః = ఇది తత్పురుషసమాసము. కావున ఉత్తరపదమునకు ఉదాత్తము వచ్చెను.

సం॥పా॥ 2) నమామి మేధ నజిహీళ ఏషా
శివాసఖిభ్య ఉతమహ్యమాసీత్।
అక్షస్యాహమేకపరస్య హేతో
రనువ్రతామపజాయామరోధమ్॥

ప॥ పా॥ న। మా। మిమేధ। న। జిహీళే। ఏషా। శివా। సఖిఒ-
భ్యః। ఉత। మహ్యమ్। ఆసీత్। అక్షస్య। అహమ్।
ఏకఒపరస్య। హేతోః। అనుఒవ్రతామ్। అప।
జాయామ్। అరోధమ్॥

సా॥భా॥ ఏషా - అస్మదీయాజాయా, మా-మాంకితవం, నమి
మేధ-నచచుక్రోధ నజిహీళే-నచలజ్జితవతీ, సఖిభ్యః - అస్మదీయేభ్యః
కితవేభ్యః, శివా-సుఖకరీ, ఆసీత్, ఉత-అపిచ, మహ్యం శివాసీత్।
ఇత్థమ్ అనువ్రతామ్ - అనుకూలాంజాయాం, ఏకపరస్య - ఏకః
పరః ప్రధానం యస్యతస్య, అక్షస్యహేతోః-కారణాత్, అహం అప
అరోధం-పరిత్యక వానస్మీత్యర్థః।

సా॥భా॥అను॥ ఏషా = నా భార్య, మా = జూదరినగు, నన్ను
నమిమేధ = కోపగించుకొనుటలేదు. నజిహీళే = సిగ్గుపడుటలేదు,
సఖిభ్యః = నా స్నేహితులకు, శివా = సుఖమును కలుగచేయునదిగా
ఆసీత్ = ఉండెను, ఉత = ఇంకనూ, మహ్యం = నాకు సంతోషమును
కలుగచేయునదిగ నుండెను. ఇత్థం-ఇట్లు అనువ్రతామ్ = అనుకూల-
మైన, జాయామ్ = భార్యను, ఏకపరస్య = ప్రధానమైన ఒక,
అక్షస్యహేతోః = పాచిక కారణముగా అహమ్ అవరోధమ్ = నేను
వదలిపెట్టినాను.

వ్యా॥ వి॥ మిమేధ = తగవులాడుట అను అర్థముకల మిధ్
ధాతువునకు లిట్ ప్రథమపురుషైకవచనము. Macdonell-తిట్టుట అని
Griffith-కోపము తెప్పించుట అని అర్థములు వివరించిరి. జిహీళే =
విరుద్ధమైన అను అర్థముగల హీడ్ ధాతువునకు లిట్ ప్రథమపురుషైక
వచనము. సాయణులు సిగ్గుపడుట అను అర్థమును వివరించిరి. ఏక

పరస్య = ఒక ప్రధానమైన అను అర్థమును సాయణులు వివ-రించిరి. (ఏకః పరః ప్రధానం యస్య) Macdonell ఏకపరస్య అనునది తత్పురుషసమాసమని ఒకదానిద్వారా "హద్దుమీరుట" అను అర్థమును వివరించెను. ("కలి" అనగా దురదృష్టపు ఆట "కృత" అనగా అదృష్టపుఆట అని Macdonell అభిప్రాయము) అప అరో-ధమ్ = అపఅను ఉపసర్గపూర్వకముగా విడిచిపెట్టుట అను అర్థముగల రుధ్ ధాతువునకు లుజ్ లకారము ఉత్తమపురుషైకవచనము. జాయా మపరోధమ్ = అనగా భార్య సలహాను తిరస్కరించుట అను అర్థమును Macdonell స్వీకరించెను.

సం॥పా॥ 3) ద్వేష్టిశ్వశ్రూర పజాయారుణద్ధి
నవాధితో విన్దతే మర్డితారమ్।
అశ్వస్యేవ జరతోవస్న్యస్య
నాహంవిన్దామికితవస్యభోగమ్॥

ప॥పా॥ ద్వేష్టి। శ్వశ్రూః। అప। జాయా। రుణద్ధి। న। నాధితః। విన్దతే। మర్డితారమ్। అశ్వస్యఽఇవ। జరతః। వ-స్న్యస్య। న। అహమ్। విన్దామి। కితవస్య। భోగమ్॥

సా॥ భా॥ శ్వశ్రూవం - జాయాయామాతా గృహగతంకిత్వం, ద్వేష్టి-నిందతీత్యర్థః। కించజాయా-భార్యా, అపరుణద్ధి-నిరుణద్ధి। అపిచ నాధితః-యాచమానః కితవః ధనం, మర్డితారం-ధనదానేన సుఖయి-తారం, నవిందతే-నలభతే। ఇత్థం బుద్ధ్వావిమృశన్, అహం జరతః - వృద్ధస్య, వస్న్యస్య-వస్నంమూల్యం తదర్హస్య, అశ్వస్యేవకితవస్య భోగం నవిందామి-నలభే॥

సా॥ భా॥ అను॥ శ్వశ్రూః = అత్త ఇంటికి వచ్చిన జూదరిని

(అల్లుడిని) ద్వేష్టి = నిందించుచున్నది కానీ, జాయా = భార్య, అపరుణద్ధి = అడ్డగించుచున్నది, ఇంకనూ నాధితః = ధనమును కోరుచున్న జూదరిని, మర్డితారం = ధనము ఇచ్చుటద్వారా సుఖమును కలుగచేయు వారిని, నవిన్దతే = పొందలేకున్నాడు, ఇట్లు ఆలోచనచేయు, అహం = నేను, జరతః = వృద్ధాప్యములో నున్న వస్న్యస్య = విలువగల, అశ్వస్య ఇవ = అశ్వమునకువలె, కితవస్య భోగంవవిన్దామి = జూదరిగా ఏలాభమును పొందుటలేదు.

వ్యా॥ వి॥ ద్వేష్టి - నిందార్థకమగు ద్విష ధాతువునకు లట్ ప్రథమపురుషైకవచనము. అపరుణద్ధి=అడ్డగించుట అను అర్థముగల రుధ్ ధాతువునకు లట్ ప్రథమపురుషైకవచనము. నాధితః=సహాయము నర్ధించుట అను నర్థముగల నాధధాతువునకు భూతకాలిక క్త ప్రత్యయ రూపము. సాయణులు అర్ధించుట Griffith నీచమైన, Macdonell నిరాశతో ఉన్న మానవుడు అను అర్థములను వివరించిరి. విందతే= విద్ల్ లాభే అను ఆత్మనేపదధాతువునకు లట్ ప్రథమపురుషైకవచనము విందామి = విద్ల్ లాభే అను పరస్మైపదధాతువునకు లట్ ఉత్తమ పురుషైకవచనము.

సం॥పా॥4) అన్యేజాయాం పరిమృశన్త్యస్య
యస్యాగృధద్వేదనేవాజ్యఒక్షః।
పితామాతా భ్రాతర ఏనమాహుః
నజానీమో నయతాబద్ధమేతమ్॥

ప॥పా॥ అన్యే। జాయామ్। పరి। మృశన్తి। అస్య। యస్య। అగృధత్। వేదనే। వాజీ। అక్షః। పితా। మాతా। భ్రాతరః।

ఏనమ్। ఆహుః। న। జానీమః। నయత। బద్ధమ్।
ఏతమ్॥

సా॥ భా॥ యస్య - కితవస్య, వేదనే - ధనే, వాజీ - బలవాన్, అక్షః-దేవః, అగృధత్ - అభికాంక్షాం కరోతి, తస్య అస్య - కితవస్య, జాయాం-భార్యాం, అన్యే-ప్రతికితవాః, పరిమృశన్తి-వస్త్రకేశాద్యా - కర్షణేనసంస్పృశన్తి। కించ పితామాతా చ భ్రాతరః - సహోదరాశ్చ, ఏనం-కితవమ్, ఆహుః-వదన్తి, న వయమస్మదీయమేనం, జానీమః। రజ్జ్వా, బద్ధమేతం - కితవం, హే కితవాః యూయం, నయత-యథేష్టదేశం ప్రాపయత॥

సా॥ భా॥ అను॥ యస్య = ఏ జూదరికి, వేదనే = ధనమునందు వాజీ = బలవంతమగు, అక్షః = పాచిక, అగృధత్ = కోరికలను (ఆశను) కలుగచేయుచున్నదో, తస్య అస్య = అటువంటి జూదరి యొక్క, జాయాం=భార్యను, అన్యే = తోటి జూదరులు, పరిమృశన్తి= వస్త్రకేశములను లాగుచూ ఆలింగనము చేయుచున్నారు. ఇంకనూ పితామాతా = జూదరి తల్లితండ్రులు, భ్రాతరః = సహోదరులు, ఏనం = జూదరినిగూర్చి, ఆహుః = ఇట్లు చెప్పుచున్నారు. "మాకు ఇతనిని గూర్చి తెలియదు." త్రాడుచే, బద్ధమేతం = బంధించబడిన ఈ జూదరిని, ఓ జూదరులారా! నయత = మీ ఇష్టము వచ్చిన ప్రదేశమునకు తీసుకు వెళ్ళండి."

వ్యా॥ వి॥ మృశన్తి - స్పృశించుట అను అర్థముగల మృశ్ ధాతువునకు లట్ ప్రథమపురుషబహువచనము. అగృధత్ = గృధు అభికాంక్షాయాం అనుధాతువునకు లుజ్ ప్రథమపురుషైకవచనము, నయతా = నీఙ్ ప్రాపణే అనుధాతువునకు లోణ్మధ్యమ పురుషబహు-వచనము. ఆఖరి అక్షరమైన తకారము ఛందశ్శాస్త్రరీత్యా దీర్ఘమును పొందెను. బద్ధమ్ = బంధించడము అను అర్థముగల బధధాతువునకు భూతకాలిక క్త ప్రత్యయసహిత ద్వితీయైక వచనరూపము.

స్వ॥ వి॥ అగృధత్ = ఇది యచ్ఛబ్దముతో ప్రారంభించ-బడినది. కనుక ఉదాత్తము వచ్చెను. నయతా = వాక్యప్రారంభ-ములో ఉన్నది గనుక ఉదాత్తమును పొందెను.

సం॥ పా॥ 5) యదాదీధ్యే నదవిషాణ్యేభిః
పరాయద్భ్యోఽవహీయేసఖిభ్యః।
న్యుప్తాశ్చ బభ్రవోవాచమక్రత
ఏమీదేషాం నిష్కృతం జారిణీవ॥

పద॥ పా॥ యత్। ఆఽదీధ్యే। న। దవిషాణి। ఏభిః। పరాయత్ఽభ్యః। అవ। హీయే। సఖిభ్యః। నిఽఉప్తాః। చ। బభ్రవః। వాచమ్। అక్రత। ఏమి। ఇత్। ఏషామ్। నిఃఽకృతమ్। జారిణీఽఇవ॥

సా॥ భా॥ యత్-యదాఅహమ్, ఆదీధ్యే-ధ్యాయామితదానీం, ఏభిఃఅక్షైః, నదవిషాణి-నదవిషాణినదేవిష్యామీత్యర్థః। పరాయద్భ్యః-స్వయమేవపరాగచ్ఛద్భ్యః, సఖిభ్యః - సఖిభూతేభ్యః కితవేభ్యః, అవహీయే - అవహితోభవామి నాహం ప్రథమమక్షాన్ విసృజామీతి, కించబభ్రవః-బభ్రువర్ణాః అక్షాః, న్యుప్తాః-కితపైరవక్షిప్తాః సన్తః, వా

చమ[్రకత-శబ్దం కుర్వన్తి, తదాసంకల్పం పరిత్యజ్య అక్షవ్యసనేనాభి భూయమానోఽహం, ఏషాం-అక్షాణాం, నిష్కృతంస్థానం, జారిణీవ - యథాకామ వ్యసనేనాభిభూయమానాస్వైరిణీ సంకేతస్థానం యాతి తద్వత్, ఏమిత్-గచ్ఛామ్యేవ॥

సా॥భా॥అను॥ యత్ = ఎప్పుడైతే నేను, ఆదీధ్యే = ఆలోచిస్తానో అప్పుడు, ఏభిః = పాచికలను, నదవిషాణి = దూషించను, జూదమాడను, పరాయద్భ్యః = తమంతట తామే దూరముగా వెళ్ళుచున్న, సఖిభ్యః = స్నేహితులగు జూదరులనుండి, అవహీయే = వదలిపెట్టబడుతిని, కానీ నేను పాచికలను విసర్జించుటలేదు. ఇంకనూ బభ్రవః = బభ్రు వర్ణములగు పాచికలు, న్యుప్తాః = జూదరులచేత జూదపటమునందు ప్రయోగించబడినవై, వాచమ[్రకత = శబ్దమును చేయుచున్నవి. అప్పుడు సంకల్పమును వదలి జూదవ్యసనముతో కూడిన నేను, ఏషాం = ఈ పాచికలయొక్క, నిష్కృతం = స్థానమును (జూదగృహమును) జార్ణీవ = కామవ్యసనముతోకూడిన స్త్రీ సంకేత స్థానమును ఎట్లు పొందునో అట్లు, ఏమి = పొందుచున్నాను.

వ్యా॥ వి॥ ఆఽదీధ్యే = దీధీఙ్దీప్తిదేవనయోః అను ఆత్మనేపదధాతువునకు లట్ ఉత్తమపురుషైకవచనము. దవిషాణి = టుదు ఉపతాపే అనుధాతువునకు (లేట్ ప్రయోగము) లుఙ్ లకారములో ఉత్తమపురుషైకవచనము. పై క్రియాపదమునకు Macdonell వెళ్ళుట Griffith - క్రీడించుట అను అర్థములను వివరించిరి. ఏభిః=ఈ పాచికలతో అని సాయణులు, ఈ స్నేహితులతో అని Macdonell వ్యాఖ్యానము చేసిరి. అవహీయే = అవ అను ఉపసర్గపూర్వకముగా ఓహాక్ త్యాగే అనుధాతువునకు కర్మణి ప్రయోగము లట్ ఉత్తమ పురుషైక-

వచనము, సాయణాచార్యులు వదలిపెట్టుట అను అర్థమునందు గ్రహించిరి. న్యప్తాః = ని అను ఉపసర్గపూర్వకముగా వపబీజసన్తానే అనుధాతువునకు సంప్రసారణయణాదేశక్త ప్రత్యయములు చేసిన తరువాత ఏర్పడిన భూతకాలిక ప్రథమాబహువచనరూపము. అక్రత= డుకృఞ్కరణే అను ఆత్మనేపదధాతువునకు లుఙ్ ప్రథమపురుషైక-వచనము. (అక్రత + ఏమి) పాదము చివరలో ఏర్పడు సంధిని నివారించుటకొరకు సంహితాపాఠములో చివరి అకారము అనునాసిక-ముగా మారెను. ఇత్-ఈ నిపాత పూర్వపదమైన ఏమి అను దానిమీద వత్తిడిని కలుగచేయును. ఇచ్చట ఇత్ అనగా తక్షణమని అర్ధము.

స్వ॥ వి॥ ఆఽదిధ్యే = యచ్ఛబ్దముతో ప్రారంభించబడినది గాన ఇది ఉదాత్తమును పొందెను. అక్రత = ఈ క్రియాపదము యచ్ఛబ్దముతో సంబంధము కలిగి ఉన్నది కాన ఉదాత్తమును పొందెను.

సం॥పా॥ 6) సభామేతికితవః పృచ్ఛమానో
జేష్యామీతితన్వా౩శూశుజానః।
అక్షాసో అస్యవితిరన్తికామం
ప్రతిదీవ్నే దధత ఆకృతాని॥

ప॥పా॥ సభామ్। ఏతి। కితవః। పృచ్ఛమానః। జేష్యామి। ఇతి।
తన్వా। శూశుజానః। అక్షాసః। అస్య। వి। తిరన్తి।
కామమ్। ప్రతిఽదీవ్నే। దధతః। ఆ। కృతాని॥

సా॥ భా॥ తన్వా - శరీరేణ, శూశుజానః దీప్యమానః, కితవః కోఽత్రాస్తి ధనికస్తం, జేష్యామీతి పృచ్ఛమానః-పృచ్ఛన్, సభాం-కితవసంబంధినీమ్ఏతి-గచ్ఛతి,తత్ర ప్రతిదీవ్నే - ప్రతిదేవి త్రేకితవాయ

కృతాని = దేవనోపయుక్తానికర్మాణి, ఆదధతః-జయార్థమాభిముఖ్యేన పర్యాదయా ఆదధతః, అస్య-కితవస్య, కామం-ఇచ్ఛాం, అక్షాసః - అక్షాః, వితిరన్తి-వర్ధయన్తి ॥

సా॥భా॥అను॥ తన్వా = శరీరముతో, శూశుజానః = (దహించు చున్న) ప్రకాశించుచున్న, కితవః = జూదరి, ధనికుడైన జూదరి ఎవరున్నారు? అతనిని, జేష్యామీతి పృచ్ఛమానః = జయించగలనని పలుకుచూ, సభాం = జూదగృహమునుగూర్చి, ఏతి = వెళ్ళుచున్నాడు అచ్చట ప్రతిదీవ్నే = ప్రత్యర్థియగు జూదరికొరకు, కృతాని = జూదమునకు ఉపయోగించెడు కర్మలను (పాచికలను), ఆదధతః = జయించవలెనని కోరికతో అభిముఖముగా ధరించుచున్న, అస్య = ఈ జూదరియొక్క, కామం = కోరికను, అక్షాసః = పాచికలు, వితిరన్తి = వృద్ధిపొందించుచున్నవి.

వ్యా॥వి॥ సాయణులు శూశుజానః అను ప్రదేశములో శోశుచానః అను పదమును ఉంచిరి. ప్రకాశించుట లేక దహించుట అను అర్థముగల శుచ్ ధాతువునుండి ఈ రూపము వ్యుత్పన్నమైనదని చెప్పిరి. శూశుజానః అనుపదము ప్రధానంగా భయము లేక నమ్మకము అను అర్థముబనుబోధించునని Macdonell అభిప్రాయము పృచ్ఛమానః = ప్రచ్ఛజీప్సాయాం వాచి అను ధాతువునకు శానచ్ ప్రత్యయము (కృదంతము) చేయుటవలన ఏర్పడిన రూపము. వితిరన్తి = వృద్ధిచెందుట అను అర్థముగల తృధాతువునకు వి అను ఉపసర్గను ముందు చేర్చగా లట్ ప్రథమపురుష బహువచనము.

స్వ॥ వి॥ తన్వా౩శూశుజానః = ఒక స్వతంత్రస్వరితము ఒక ఉదాత్తముచేత అనుసరించబడినప్పుడు అది కంప-స్వరితమనబడును

ఉదాత్తమునకు ముందు 1 లేక 3 అంకెలతో గుర్తించబడును. ఈ స్వరితము దీర్ఘాచ్చుపై వచ్చినపుడు ఆ అంకె 3 క్రింద అడ్డగీత, పైన నిలువుగీతలతో గుర్తించబడును. ఈ అంకెకు ముందున్న అక్షరము కూడా క్రింద అడ్డగీతతో గుర్తించబడును. ఉదా. వస్త్వ్యా 3 స్వా

సం॥ పా॥ 7) అక్షాస ఇదఙ్కుశినోనితోదినో
నికృత్వానస్తపనాస్తాపయిష్ణవః।
కుమారదేష్ణాజయతః పునర్హణో
మధ్వాసమ్పృక్తాః కితవస్యబర్హణా॥

ప॥ పా॥ అక్షాసః। ఇత్। అఙ్కుశినః। నిఽతోదినః। నిఽకృత్వానః। తపనాః। తాపయిష్ణవః। కుమారఽదేష్ణాః। జయతః। పునఃఽహనః। మధ్వా। సమ్ఽవృక్తాః। కితవస్య। బర్హణా॥

సా॥ భా॥ అక్షాస ఇత్ - అక్షాఏవ, అంకుశినః - అంకుశవన్తః, నితోదినః - నితోదితవన్తశ్చ, నికృత్వానః - పరాజయేనికర్తన శీలాశ్చేత్తారోవా, తవనాః-పరాజయే, కితవస్య-సంతాపకాః, తాపయిష్ణవః సర్వస్వాపహారకత్వేన, కుటుంబస్య సంతాపనశీలాశ్చభవన్తి। కించ జయతః కితవస్యకుమారదేష్ణాః-ధనదానేన ధాన్యతాం లంభయంతః కుమారాణాం దాతారోభవన్తి। అపిచ మధ్వా-మధునా, సంపృక్తాః - ప్రతికితవేన, బర్హణా-పరివృద్ధేన సర్వస్వహరణేన, కితవస్యపునర్హణః-పునర్హంతారో భవంతి॥

సా॥భా॥అను॥ అక్షాస ఇత్ = పాచికలే, అంకుశినః=అంకుశము వంటివి, నితోదినః = బాధను కలుగచేయునవి. నికృత్వానః = పరా

జయమునందు (ఖండించునవి, ఛేదించునవి) కితవస్య = జూదరికిం తపనాః = పరాజయముద్వారా సంతాపమును కలుగజేయునవి. తాపయిష్ణవః = సర్వస్వమును హరించుటద్వారా కుటుంబమును దహించుచున్నవి. ఇంకనూ జయతః = జయించవలెనను, కితవస్య = జూదరికి, కుమారదేష్ణాః (చిన్నపిల్లలు బహుమతులిచ్చి మరలవెనుకకు తీసుకున్నట్లు) ధనమును కలుగచేసి మరల పొగొట్టుచున్నవి.మధ్వా= తేనెతో, సంపృక్తాః = కూడిన మాటలవలె ప్రత్యర్థియగు జూదరి ద్వారా, బర్హణా = సర్వస్వమును హరించుటచేత, కితవస్యపునర్హణః = జూదరిని మరల హింసించునవిగా నున్నవి.

వ్యా॥వి॥ కుమారదేష్ణాః = చిన్నపిల్లలవలె బహుమతులనిచ్చి తిరిగి తీసుకొనుట అని అర్థము. Griffith పండితుడు సున్నితమైన బహుమతులిచ్చుట అను అర్థమునందు గ్రహించెను. సంపృక్తాః = కూడుకొనుట, కలుపుట అను అర్థముగల పృక్ధాతువునుండి నిష్పన్నమైన భూతకాలిక కృదంతరూపము, బర్హణా = బృహ ధాతువునకు వృద్ధిపొందించుట అను అర్థముగలదు. సాయణులు వృద్ధిపొందించి సర్వస్వమును హరించుట యని Macdonell గారడీశక్తియని MWD నిశ్చయముగా అని అర్థములను వివరించిరి.

సం॥పా॥ 8) త్రిపంచాశః క్రీళతి వ్రాతఏషాం
దేవఇవ సవితాసత్యధర్మా।
ఉగ్రస్య చిన్మన్యవేనా నమన్తే
రాజాచిదేభ్యోనమఇత్కృణోతి॥

ప॥ పా॥ త్రిపంచాశః। క్రీళతి। వ్రాతః। ఏషామ్। దేవఃఽ
ఇవ। సవితా। సత్యఽధర్మా। ఉగ్రస్య। చిత్। మన్యవే।

న। నమన్తే। రాజా। చిత్। ఏభ్యః। నమః। ఇత్। కృణోతి॥

సా॥ భా॥ ఏషాం-అక్షాణాం త్రిపంచాశః-త్ర్యధికపంచాశత్సంఖ్యాకః, వ్రాతః-సంఘః క్రీళతి-ఆస్ఫారేవిహరతి అక్షికాః ప్రాయేణ తావద్భిరక్షై ర్దీవ్యన్తేహి। తత్రదృష్టాంతః-సత్యధర్మాసవితా - సర్వస్య జగతః ప్రేరకః సూర్యోదేవ ఇవ-యథా సవితాదేవో జగతి విహరతి తద్వదక్షాణాం సంఘ ఆస్ఫారే విహరతీత్యర్థః। ఉగ్రస్యచిత్ - క్రూరస్యాపి, మన్యవే-క్రోధాయ, ఏతే అక్షాః, న నమన్తే-న ప్రహ్వీభవన్తి నవశేవర్తన్తే, తంనమయన్తీత్యర్థః। రాజాచిత్ - జగత ఈశ్వరోఽపి, ఏభ్యః నమఇత్-నమస్కారమేవ దేవనవేలాయాం, కృణోతి-నావజ్ఞాం కరోతీత్యర్థః॥

సా॥ భా॥ అను॥ ఏషాం = పాచికలయొక్క, త్రిపంచాశః = ఏబదిమూడు సంఖ్యలతోకూడిన, వ్రాతః = సంఘము, క్రీళతి = జూదమాడుపటమునందు విహరించుచున్నది. (సాధారణముగా 53 సంఖ్యల పాచికలతోనేజూదమాడబడును)ఇచ్చటదృష్టాంతము-సత్యధర్మాసవితా సకలజగత్తునకు ప్రేరకుడగు, దేవఇవ = సూర్యదేవునివలె (ఎట్లైతే సూర్యదేవుడు ప్రపంచమునందు విహరిస్తాడో అట్లే పాచికలసంఘము జూదమాడు పటమునందు విహరించుచున్నది.) ఇంకనూ ఉగ్రస్య చిత్ = క్రూరుడైన వానికి, మన్యవే = క్రోధముతోకూడిన వానికి కూడా ఈ పాచికలు, ననమన్తే = నమస్కరించవు, వారి అధీనములో ఉండవు, వారిచేత నమస్కారమును పొందుచున్నవి. రాజాచిత్ = లోకమును పాలించు రాజుకూడా, ఏభ్యః నమఇత్ = జూదమాడు సమయమున వీటికి నమస్కరిస్తాడు.

వ్యా॥ వి॥ త్రిపంచాశః = ఈ పదమునకు సాయణులు (53) సంఖ్యయని Ludwig (15) అని, Macdonell (150) అని అర్థములను చెప్పిరి. క్రీళతి = ఆడుట అను అర్థముగల క్రీడధాతువునకు లట్ ప్రథమపురుషైకవచనము. సత్యధర్మా = సకల జగత్తునకు ప్రేరకుడగు సూర్యుడు అని అర్థము, ఇది బహువ్రీహిసమాసము. నా = నిషేధార్థములోగల నిపాత, చందశ్శాస్త్రరీత్యా దీర్ఘమును పొందెను. నమన్తే = నమ ప్రహ్వీభావే అను ఆత్మనేపదధాతువునకు లట్ ప్రథమ పురుషబహువచనము.

సం॥పా॥ 9) నీచావర్తన్త ఉపరిస్ఫుర
న్త్యహస్తాసోహస్తవన్తంసహన్తే।
దివ్యాఅఙ్గారా ఇరిణేన్యుప్తాః
శీతాః సన్తోహృదయం నిర్దహన్తి॥

పద॥ పా॥ నీచా। వర్తన్తే। ఉపరి। స్ఫురన్తి। అహస్తాసః। హస్తఽవన్తమ్। సహన్తే। దివ్యాః। అఙ్గారాః। ఇరిణే। నిఽఉప్తాః। శీతాః। సన్తః। హృదయమ్। నిః। దహన్తి॥

సా॥ భా॥ అపిచైతేఽక్షాః, నీచీ - నీచానస్థలే, వర్తన్తే, తథాపి ఉపరి-పరాజయాత్భీతానాం ద్యూతకరాణాం కితవానాం హృదయస్యోపరి, స్ఫురన్తి అహస్తాసః-హస్తరహితా అప్యక్షాః, హస్తవన్తం-ద్యూతకరం కితవం, సహన్తే - పరాజయకరణేనాభిభవన్తి దివ్యాః - దివిభవా అపకృతాః, అఙ్గారాః - అఙ్గారసదృశా అక్షాః, ఇరిణే - ఇంధనరహితే ఆస్ఫారే, న్యుప్తాః శీతాః-శీతస్పర్శాః సన్తః అపి, హృదయం-కితవానామన్తః కరణం, నిర్దహన్తి-పరాజయ జనితసంతాపేన భస్మీకుర్వన్తి॥

సా॥ భా॥ అను॥ ఇంకనూ ఈ పాచికలు, నీచాః = నీచస్థానమున (క్రింద ప్రదేశములో) వర్తన్తే = ఉన్నవి, అయిననూ, ఉపరి = పరాజయమువలన భయపడిన జూదమాడు జూదరుల హృదయ పైభాగమున, స్ఫురన్తి = సంచరించుచున్నవి. అహస్తాసః = హస్తములులేని పాచికలు, హస్తవన్తం = హస్తములుకలిగిన జూదరిని సహన్తే = పరాజయముద్వారా అవమానపరుచుచున్నవి. దివ్యాః = దేవలోకములో నున్న, అంగారాః = (బొగ్గు) అంగారమువంటి పాచికలు, ఇరిణే = ఇంధనములేని జూదపటమునందు, న్యుప్తాః శీతాః = చల్లనిస్పర్శను, సన్తః = కలిగినపైననూ, హృదయం = జూదరుల యొక్క హృదయమును, నిర్దహన్తి = పరాజయమువలన కలిగిన సంతాపముద్వారా దహించుచున్నవి.

వ్యా॥ వి॥ నీచా-ఉపరి, అహస్తాసః - హస్తవన్తమ్, దివ్యాః - ఇరిణేశీతాః-నిర్దహన్తి ఇవివిరుద్ధార్థముగల ప్రయోగములు. స్ఫురన్తి = కదలుట అను అర్థముగల స్ఫుర్ ధాతువునకు లట్ ప్రథమ పురుష బహువచనము. అహస్తాసః = హస్తములేని వారు ఇది బహువ్రీహి-సమాసము. సహన్తే = (సహించుట) జయించుట అను అర్థముగల ఆత్మనేపద సహధాతువునకు లట్ ప్రథమ పురుషబహువచనము.

స్వ॥ వి॥ అహస్తాసః - ఇదిబహువ్రీహిసమాసముగాన (6-2-172) పాణినిసూత్రముచే ఉత్తరపదమునకు ఉదాత్తము వచ్చెను.

సం॥ పా॥ 10) జాయాతప్యతే కితవస్యహీనా
మాతాపుత్రస్య చరతః క్వస్విత్।
ఋణావాబిభ్యద్ధనమిచ్ఛమానోఽన్యే
షామస్తముపనక్తమేతి॥

పద॥ పా॥ జాయా। తప్యతే। కితవస్య। హీనా। మాతా।
పుత్రస్య। చరతః। క్వ। స్విత్। ఋణఽవా। బిభ్యత్
ధనమ్। ఇచ్ఛమానః। అన్యేషామ్। అస్తమ్। ఉప।
నక్తమ్। ఏతి॥

సా॥ భా॥ క్వస్విత్-క్వాపి, చరతః-నిర్వేదాద్గచ్ఛతః,కితవస్య జాయా-భార్యా, హీనా-పరిత్యక్తా సతీ, తప్యతే - వియోగజసంతాపేన సంతప్తా భవతి। మాతా-జనన్యపి, పుత్రస్య - క్వాపి చరతః కితవస్య సంబంధాద్ధీనాతప్యతే, పుత్రశోకేనసంతప్తాభవతి। ఋణావా-అక్షపరాజయాదృణవాన్ కితవః సర్వతో, బిభ్యద్ధనం-స్తేయజనితం, ఇచ్ఛమానః-కామయమానః, అన్యేషాం-బ్రాహ్మణాదీనాం, అస్తం-గృహం నక్తం-రాత్రౌ, ఉపఏతి-చౌర్యార్థము పగచ్ఛతి॥

సా॥భా॥అను॥ క్వస్విత్ = అక్కడక్కడ, చరతః = దుఃఖముతో సంచరించుచున్న, కితవస్యజాయా = జూదరి భార్య, హీనా = భర్త చేత వదిలిపెట్టబడినదై, తప్యతే=వియోగమువలన కల్గిన సంతాపము చేత దుఃఖించుచున్నది. మాతా = తల్లికూడ, పుత్రస్య = ఎచ్చటనో సంచరించు పుత్రుని సంబంధములేనిదై బాధపడుచున్నది, పుత్రశోకముతో దుఃఖించుచున్నది, ఋణావా = జూదములో ఓటమివలన ఋణగ్రస్తుడైన జూదరి అన్నివిధములుగా, బిభ్యత్ ధనం = భయపడుచూ చౌర్యమువలన ధనమును, ఇచ్ఛమానః = కోరుచున్నవాడై, అన్యేషాం = బ్రాహ్మణులయొక్క, అస్తం = గృహమును, నక్తం = రాత్రియందు, ఉపఏతి = దొంగతనము చేయుటకొరకు ప్రవేశించుచున్నాడు.

వ్యా॥ వి॥ తప్యతే = దహించుట అను అర్థముగల తపధాతువు

నకు కర్మణి ప్రయోగమునందు లట్ ప్రథమపురుషైకవచనము. బిభ్యత్ = ఞిభీభయే అనుధాతువునుండి నిష్పన్నమైన వర్తమానకాలిక సుబంతరూపము, ఇచ్ఛమానః = ఇచ్ఛ అను అర్థముగల ఇషుధాతువు నకు వర్తమానకాలికసుబంతరూపము (ఈపదము శానచ్ ప్రత్యయము వలన ఏర్పడెను) ఉపఏతి ఉప అను ఉపసర్గపూర్వకముగా ఇణ్= గతౌ అనుధాతువునకు లట్ ప్రథమపురుషైకవచనము.

సం॥పా॥ 11) స్త్రియం దృష్ట్వాయకితవం తతాపాన్యేషాం
జాయాం సుకృతం చయోనిమ్।
పూర్వాహ్ణే అశ్వాన్యుయుజేహిబభ్రూన్
త్సో అగ్నేరన్తే వృషలః పపాద॥

పద॥పా॥ స్త్రియమ్। దృష్ట్వాయ। కితవమ్। తతాప। అన్యేషామ్।
జాయాం। సుఽకృతమ్। చ। యోనిమ్। పూర్వాహ్ణే।
అశ్వాన్। యుయుజే। హి। బభ్రూన్। సః। అగ్నేః।
అన్తే। వృషలః। పపాద॥

సా॥భా॥ కితవం-కితవః, అన్యేషాం-స్వవ్యతిరిక్తానాం పురుషాణాం, జాయాం-జాయాభూతాం, స్త్రియం - నారీంసుఖేనవర్తమానాం సుకృతం-సుష్ఠుకృతం, యోనిం-గృహం చ దృష్ట్వాయ - మజ్జాయా దుఃఖితాగృహం చా సంసన్కృతమితిజ్ఞాత్వా, తతాప-తప్యతే, పునః పూర్వాహ్ణే-ప్రాతఃకాలే, బభ్రూన్-బభ్రూవర్ణాన్, అశ్వాన్-వ్యాపకాన-యుయుక్షాన్, జేయునక్తి, పునశ్చ వృషలః-వృషలకర్మా,సః-కితవః, అగ్నేరన్తే-సమీపే, పపాద-శీతార్తః సన్శేతే॥

సా॥ భా॥ అను॥ కితవం=జూదరి, అన్యేషాం=తనకంటే వేరగు

పురుషులయొక్క, జాయాం = భార్యయగు, స్త్రియం = సుఖముగా ఉన్న స్త్రీని, సుకృతం=చక్కగా సిద్ధముచేసిన, యోనిం=గృహమును చదృష్ట్వాయ = చూచి నాభార్య దుఃఖిరాతులైనది. గృహముకూడా సంస్కరింపబడలేదని తెలుసుకొని తతాప = దుంఖించుచున్నాడు. మరల పూర్వాహ్ణే = ప్రాతఃకాలమునందు, బభ్రూన్ = బభ్రువర్ణము లగు, అశ్వాన్ = వ్యాపించు స్వభావముగల పాచికలను, యుయుజే= సిద్ధము చేయుచున్నాడు. ఇంకనూ వృషలః = నిందించదగు కర్మ-లను చేయు, సః = ఆ జూదరి రాత్రులందు, అగ్నేరన్తే = అగ్ని సమీపమున, పపాద = చలిబాధను పోగొట్టుకొనుటకు నిద్రించు-చున్నాడు.

వ్యా॥ వి॥ దృష్ట్వాయ = దృశిర్ ప్రేక్షణే అనుధాతువునకు "త్వాయ" అను తుమున్నర్థ క ప్రత్యయము చేర్చబడినది. కితవమ్= (కితవః) ప్రథమైకవచనమునకు బదులు ద్వితీయైకవచనము ప్రయోగించబడినది. తతాప = తపదాహే అనుధాతువునకు లిట్ ప్రథమ-పురుషైకవచనము, ప్రియంజాయామ్ = భార్యయగు స్త్రీని (వివరించుటకై ఒక నామవాచకముతో మరియొక నామమునుచేర్చుట) అశ్వాన్= ఇచ్చట పాచికలు గుఱ్ఱములని అలంకారోక్త్యా పేర్కొనబడెను. యుయుజే = స్వాధీనపరుచుకొను, ఉపయోగమునకు తెచ్చు అను అర్థముగల యుజధాతువునకు లిట్ ప్రథమ పురుషైకవచనము. వృషలః = అలక్ష్యమును కలిగించు మనిషి (సాయణులు) ఇతరుల కులమువాడు (Griffith) యాచించువాడని Macdonell అర్థములు చెప్పిరి.

స్వ॥వి॥ యుయుజే-అనునది హిఅనుదానిచేత అనుసరింపబడుటచే

ఉదాత్తమును పొందెను. యద్ధితుపరం ఛందసి (8-1-56) అను పాణిని సూత్రముచే.

సం॥పా॥ 12) యోవః సేనానీర్మహతో గణస్య
రాజా వ్రాతస్య ప్రథమోబభూవ।
తస్మై కృణోమి నధనారుణధ్మి
దశాహం ప్రాచీస్తదృతంవదామి॥

ప॥ పా॥ యః। వః। సేనా౽నీః। మహః తః। గణస్య। రాజా। వ్రాతస్య। ప్రథమః। బభూవ। తస్మై। కృణోమి। న। ధనా। రుణధ్మి। దశ। అహమ్। ప్రాచీః। తత్। ఋతమ్। వదామి॥

సా॥ భా॥ హే అక్షాః వః-యుష్మాకం, మహతోగణస్య-సంఘస్య యః-అక్షః, సేనానీః-నేతా, బభూవ-భవతి వ్రాతస్యచ। రాజా-ఈశ్వరః, ప్రథమః-ముఖ్యోబభూవ, తస్మై-అక్షాయ, కృణోమి-అహమం జలిం కరోమి. అతః పరంధనా-ధనాని అక్షార్ధమహం, నరుణధ్మి-నసంపాద-యామీత్యర్థః। ఏతదేవ దర్శయతి-అహందశ-దశసంఖ్యాకా అంగులీః, ప్రాచీః-ప్రాఙ్ముఖీః కరోమి। తత్-ఏతత్ అహం, ఋతం - సత్యమేవ వదామి, నానృతం బ్రవీమీత్యర్థః।

సా॥ భా॥ అను॥ ఓ పాచికలారా! వః = మీయొక్క, మహతో-గణస్య = గొప్పదగు సంఘమునకు, యః సేనానీః = ఏ పాచిక నాయకుడుగా, బభూవ ఉన్నది, వ్రాతస్యచ = గణమునకు కూడా, రాజా = అధిపతి, ప్రథమః = ముఖ్యుడు ఎవరో, తస్మై = అపాచికకు కృణోమి = నేను నమస్కారము చేయుచున్నాను. ఇకపైన, ధనా = ధనమును జూదమాడుటకు, నరుణధ్మి = సంపాదించను, అహం =

నేను, దశ = పది ప్రేళ్ళను, ప్రాచీః = తూర్పుముఖముగా, కరోమి = ఉంచుచున్నాను. (అనగా అంజలి ఘటించి నమస్కరించుచున్నాడని అర్థము.) తత్ = ఈ విషయములో నేను, ఋతమ్ = సత్యమునే, వదామి = చెప్పుచున్నాను, అసత్యము చెప్పుటలేదు.

వ్యా॥వి॥ బభూవ-భూ సత్తాయాం అనుధాతువునకు లిట్ ప్రథమ పురుషైకవచనము. కృణోమి = చేయుట అను అర్థముకల కృధాతువునకు లట్ ప్రథమపురుషైకవచనము. రుణధ్మి = రుధిర్ ఆవరణే అను ధాతువునకు లట్ ఉత్తమపురుషైకవచనము.

స్వ॥వి॥ బభూవ = వ్యాకరమునందలి వాక్యలక్షణము ననుసరించి యచ్ఛబ్దముతో సంబంధమేర్పడెను కనుక ఉదాత్తము సిద్ధించెను.

సం॥పా॥ 13) అక్షైర్మాదీవ్యః కృషి మిత్కృషస్వ
విత్తేరమస్వబహుమన్యమానః।
తత్రగావః కితవ తత్రజాయా
తన్మే విచష్టే సవితాయమర్యః॥

ప॥ పా॥ అక్షైః। మా। దీవ్యః। కృషిమ్। ఇత్। కృషస్వ। విత్తే। రమస్వ। బహు। మన్యమానః తత్ర। గావః। కితవ। తత్ర। జాయా। తత్। మే। వి। చష్టే। సవితా। అయమ్। అర్యః॥

సా॥ భా॥ హే కితవ బహుమన్యమానః _ మద్వచనే విశ్వాసం కుర్వం స్త్వమ్, అక్షైఃమాదీవ్యః_ద్యూతంమాకురు। కృషిమిత్-కృషి

మేవకృషస్వ-కురు, విత్తే-కృష్యాసంపాదితేధనే, రమస్వ-రతింకురు, తత్రకృషౌ, గావః భవన్తి। తత్రజాయా భవతి। తత్ ఏవధర్మరహస్యం శృతిస్మృతికర్తా, సవితా - సర్వస్యప్రేరకః, అయం - దృష్టిగోచరః, అర్యః-ఈశ్వరః, విచష్టే-వివిధమాఖ్యాతవాన్॥

సా॥భా॥అను॥ హే కితవ = ఓ జూదరీ! బహుమన్యమానః = నా మాటలందు విశ్వాసముంచి, అక్షైః మాదీవ్యః = నీవు ఇకపైన జూడమాడవద్దు. కృషిమిత్ = వ్యవసాయమును, కృషస్వ=చేయుము విత్తే = వ్యవసాయమువలన సంపాదించిన ధనముతో, రమస్వ = ఆనందముగా ఉండుము. తత్ర = వ్యవసాయమునందు, గావః = ఎద్దులు ఉన్నవి. తత్రజాయా = నీ భార్య ఉన్నది. తత్ = ఈధర్మ రహస్యమును శృతిస్మృతి కర్తయగు, సవితా = లోకములో జను-లందరికి ప్రేరేపకుడు, అయం = ప్రత్యక్షముగాగోచరమగు, అర్యః= ఈశ్వరుడు, విచష్టే = బహుప్రకారములుగా చెప్పెను.

వ్యా॥ వి॥ దీవ్యః = దివ్ క్రీడాయాం అనుదాతువునకు విధ్యర్థములో మధ్యమపురుషైకవచనము. కృషస్వ = దున్నుట అను అర్థము గల కృపధాతువునకు (ఆత్మనేపదము) లోణ్మధ్యమ పురుషైకవచనము రమస్వ = అనందించుట అను అర్థముగల ఆత్మనేపదరమధాతువునకు లోణ్మధ్యమ పురుషైకవచనము, బహుమన్యమానః = మద్వచనే విశ్వాసం కుర్వన్, నా మాటలందు విశ్వాసము ప్రకటించి అని సాయణులు, దీనినిగూర్చి బాగా ఆలోచించి, అని Macdonell ఐశ్వ-ర్యము సమృద్ధిగ ఉన్నదని తలంచి అని Griffith అర్థములను వివరించిరి. విచష్టే = వి అను ఉపసర్గపూర్వకముగ చక్షిఙ్ వ్యక్తా-యాంవాచి అనుధాతువునకు లట్ ప్రథమపురుషైకవచనము.

సం॥పా॥ 14) మిత్రం కృణుధ్వం ఖలు మృళతానో
మానో ఘోరేణ చరతాభిధృష్ణు।
నివోనుమన్యుర్విశతామరాతి
రన్యోబభ్రూణాంప్రసితౌన్వస్తు॥

ప॥ పా॥ మిత్రం। కృణుధ్వమ్। ఖలు। మృళత। నః। మా। నః। ఘోరేణ। చరత। అభి। ధృష్ణు। ని। వః। ను। మన్యుః। విశతామ్। అరాతిః। అన్యః। బభ్రూణామ్। ప్రఽసితౌ। ను। అస్తు॥

సా॥భా॥ హే అక్షాః యూయం, మిత్రం కృణుధ్వమ్-అస్మాసు మైత్రీం కురుత। నః-అస్మాన్, మృళత-సుఖయత చ। నః-అస్మాన్ ధృష్ణు-ధృష్ణునా, ఘోరేణ-అసహ్యేన, మా అభిచరత - మాగచ్ఛత, కించ వః-యుష్మాకం, మన్యుః - క్రోధః, అరాతిః-అస్మాకం శత్రుః, నివిశతామ్-అస్మచ్ఛతృషు తిష్ఠతు, అన్యః-అస్మాకం శత్రుః కశ్చిత్, బభ్రూణాం-బభ్రువర్ణానాం యుష్మాకం, ప్రసితా-ప్రబంధనే,నుతౌక్షిప్రమ్, అస్తు-భవతు॥

సా॥భా॥అను॥ ఓ పాచికలారా! మీరు, మిత్రం కృణుధ్వం = మాతో స్నేహము చేయుడు. నః = మమ్ములను, మృళత = సుఖవంతులుగా చేయుము, నః = మమ్ములనుగూర్చి, ఘోరేణ=భరించుటకు వీలుకాని, ధృష్ణు = శక్తిచేత, మా అభిచరత = ప్రవర్తించకుము ఇంకనూ వః=మీయొక్క,మన్యుః = క్రోధము, అరాతిః= మా శత్రువు, నివిశతామ్=మా శత్రువులందు ప్రవేశించుగాక! అన్యః=మాయొక్క శతృవు ఇంకొకడు, బభ్రూణాం = బభ్రువర్ణములగు మీ పాచికల, ప్రసితౌ = అధీనమునందు, ను = వేగముగా, అస్తు = ఉండుగాక!

వ్యా॥ వి॥ కృణుధ్వమ్ = చేయుట అను అర్థముగల ఆత్మనే పద కృధాతువునకు లోణ్మధ్యమ పురుషబహువచనము. ఖలు - పూరణార్థక అవ్యయము, Griffith-దీనిని కొంచెము అను అర్థమునందు గ్రహించెను. మృళతా = దయను ప్రదర్శించుట అను అర్థముగల మృద్ ధాతువునకు లోణ్మధ్యమ పురుష బహువచనము "చాదిలోపే విభాషా" అను పాణినిసూత్రముచే (8-1-63) ఆఖరి అక్షరము ఛందశ్శాస్త్రరీత్యా దీర్ఘమును పొందెను. ఘోరేణ = భరించరాని అని (సాయణులు) భయంకరమగు అని (Griffith) ఇంద్రజాలశక్తి అని (Macdonell) అర్థములను వివరించిరి. అభిచరత-చరగతిభక్షణయోః అనుధాతువునకు లోణ్మధ్యను పురుషబహువచనము వైదికభాషలో ఉపసర్గలు క్రియల తరువాతకూడ ఏర్పడును. (చరతఅభి) మనస్సును ఆకర్షించు (Macdonell) వెళ్ళుట [Sayana] అను అర్థములను వివరించిరి. నివిశతామ్-ని అను ఉపసర్గపూర్వకముగా విశ ప్రవేశనే ధాతువునకు లోట్ ప్రథమపురుషైకవచనము. ప్రసితౌ = ప్రసిత అనుశబ్దమునకు సప్తమ్యేకవచనము, బంధనార్థక సిధాతువునుండి నిష్పన్నమైన భూతకాలికరూపము.

స్వ వి॥ మృళతా = అనుచోట రెండుపదములను కలుపు "చ" అను అవ్యయము లోపించెను గనుక ఉదాత్తము వచ్చెను.

—ం—

# 7) పురుషసూక్తము

సం॥పా॥ 1) సహస్రశీర్షా పురుషః
సహస్రాక్షః సహస్రపాత్-
సభూమిం విశ్వతోవృత్వాత్యతిష్ఠ
ద్దశాంగులమ్॥

పద॥పా॥ సహస్రఽశీర్షా।పురుషః। సహస్రఽఅక్షః।సహస్రఽ। పాత్। సః। భూమిమ్। విశ్వతః। వృత్వా। అతి। అతిష్ఠత్। దశఽఅంగులమ్॥

సా॥భా॥ సర్వప్రాణి సమష్టిరూపః బ్రహ్మాణ్డదేహో విరాడాఖ్యో యః పురుషః సోఽయం సహస్రశీర్షా - సహస్రశబ్దస్య ఉపలక్షణత్వా-దనంతైః శిరోభిర్యుక్త ఇత్యర్థః। యాని సర్వప్రాణినాం శిరాంసి తాని సర్వాణి తద్దేహాంతః పాతిత్వాత్ తదీయాన్యేవేతి సహస్రశీర్షత్వం, ఏవం సహస్రాక్షత్వం సహస్రపాదత్వం చ। సః-పురుషః, భూమి-బ్రహ్మాండగోలకరూపాం, విశ్వతః - సర్వతః, వృత్వా - పరివేష్ట్య, దశాంగులమ్-దశాంగుల పరిమితం దేశం, అత్యతిష్ఠత్ - అతిక్రమ్య వ్యవస్థితః। దశాంగులమిత్యుపలక్షణమ్, బ్రహ్మాండాద్బహిరపి సర్వతో వ్యాప్యావస్థిత ఇత్యర్థః।

సా॥భా॥అను॥ సకల ప్రాణులకు సమష్టిరూపుడు, బ్రహ్మాండమును దేహముగాగల విరాట్ అనుపేరుతో, యః పురుషః = ఏపురుషుడు కలడో ఆయన, సహస్రశీర్షా = వేలకొలది శిరస్సులతోకూడినవాడు అని అర్థము. సకలప్రాణులయొక్క శిరస్సులు ఏవి కలవో అవన్నీ విరాట్ పురుషుని దేహమునందుండుటవలన విరాట్పురుషునికి వేయిశిరస్సులు సిద్ధించినవి, అట్లే వేలకొలది నేత్రములు, పాదములుకూడా కలవు.

సః = ఆ పురుషుడు, భూమిం = బ్రహ్మాండ గోలరూపములో నున్న భూమిని విశ్వతః = నాలుగుదిక్కుల అంతటనూ, వృత్వా=వ్యాపించి, దశాంగులం = దశాంగుల పరిమితమగు ప్రదేశమును, అత్యతిష్ఠత్ = అతిక్రమించి ఉండెను. బ్రహ్మాండమునకు వెలుపలకూడా అంతా వ్యాపించి ఉండెనని అర్థము.

వ్యా॥ వి॥ సహస్రఽశీర్షా = సహస్రశబ్దము ఉపలక్షణము, అనంతములగు శిరస్సులతోకూడిన విరాట్‌పురుషుడు. సహస్రఽఅక్షః= బహువ్రీహిసమాసము. వృత్వా = వృతువర్తనే అనుధాతువునకు క్త్వా ప్రత్యయము చేయుటవలన ఏర్పడిన అవ్యయము.

స్వ॥ వి॥ సహస్రఽశీర్షా - ఇది బహువ్రీహిసమాసము కావున పూర్వపదమునకు ఉదాత్తము వచ్చెను. సహస్రఽఅక్షః - ఇదియును బహువ్రీహిసమాసము ఒక క్రమములేకుండా ఉత్తరపదమునకు ఉదాత్తము వచ్చెను.

సం॥పా॥ 2) పురుష ఏ వేదం సర్వం యద్భూతం
యచ్చ భవ్యమ్।
ఉతామృతత్వ స్యేశానో
యదన్నే నాతిరోహతి॥

పద॥ పా॥ పురుషః। ఏవ। ఇదమ్। సర్వమ్। యత్। భూతమ్।
యత్। చ। భవ్యమ్। ఉత। అమృతఽత్వస్య।
ఈశానః। యత్। అన్నేన। అతిఽరోహతి॥

సా॥ భా॥ యదిదం-వర్తమానం జగత్ తత్, సర్వం పురుష-ఏవ। యచ్చ భూతం-అతీతం జగత్, యచ్చ భవ్యం-భవిష్యజ్జగత్‌తదపి పురుషఏవ। యథాస్మిన్‌కల్పేవర్తమానాః ప్రాణిదేహాః సర్వేఽపి విరాట్

పురుషస్యావయవాః తథైవ అతీతాగామినోరపి కల్పయోర్ద్రష్టవ్యమిత్య భిప్రాయః। ఉత-అపిచ,అమృతత్వస్యచ-దేవత్వస్య అయం, ఈశానః స్వామీ, యత్-యస్మాత్ కారణాత్, అన్నేన-ప్రాణినాం భోగ్యేనాన్నేన నిమిత్తభూతేన, అతిరోహతి-స్వకీయాం కారణావస్థామతిక్రమ్య పరి-దృశ్యమానాం జగదవస్థాం ప్రాప్నోతి, తస్మాత్ ప్రాణినాం కర్మఫల భోగాయ జగదవస్థాస్వీకారాన్నేదం తస్యవస్తుత్వమిత్యర్థః।

సా॥భా॥అను॥ యత్ ఇదం = ఇప్పుడు ఏ జగత్తు కలదో అది, సర్వం, పురుష ఏవ = అంతా విరాట్‌పురుషుడే, యచ్చ భూతమ్ = గడచిన ప్రపంచము, యచ్చ భవ్యం=జరుగబోవు ప్రపంచముకూడా పరమపురుషుని స్వరూపమే. ఎట్లైతే ఈ కల్పమునందున్న సకల ప్రాణిదేహములు విరాట్‌పురుషుని అవయవములైనవో అట్లే భూతకాల కల్పములో ఉన్నవి, భవిష్యత్‌కాలములో ఏర్పడునవికూడా. విరాట్ పురుషుని అవయవములని గ్రహించవలెను. ఉత = ఇంకనూ, అమృతత్వస్య = దేవత్వమునకు ఇతడు, ఈశానః = అధిపతి, యత్ = ఏ కారణమువలన, అన్నేన = ప్రాణులచేత భుజించబడు అన్నమును నిమిత్తముగా చేసుకొని అతిరోహతి = తనయొక్క కారణావస్థను అతిక్రమించి - ప్రత్యక్షముగా గోచరమగు జగదవస్థను పొందు-చున్నాడు. అందువలన ప్రాణుల కర్మఫలముననుభవించు జగవస్థను స్వీకరించుటవలన ఇది ఆయన వస్తుత్వముకాదు.

వ్యా॥ వి॥ భూతమ్ = భూ సత్తాయాం అను ధాతువునకు భూత కాలిక క్త ప్రత్యయరూపము, భవ్యమ్ = భూ ధాతువునకు భవిష్య-దర్థమును తెలియచేయు య ప్రత్యయరూపము. ఈశానః = స్వామి అను అర్థముగల ఈశ్ ధాతువునకు వర్తమానకాలిక సుబంతరూపము.

అతిఽరోహతి = అతి అను ఉపసర్గపూర్వకముగా గల అధిరోహించుట అను అర్థముగల రుహధాతువునకు లట్ ప్రథమపురుషైకవచనము.

స్వ॥ వి॥ అతిఽరోహతి = అనుచోట యచ్ఛబ్దముతో వాక్య ప్రారంభము గనుక ఉదాత్తస్వరము వచ్చెను.

సం॥పా॥ 3) ఏతావానస్య మహిమాతో
జ్యాయాశ్చ పూరుషః।
పాదోఽస్య విశ్వాభూతాని
త్రిపాదస్యామృతందివి॥

ప॥ పా॥ ఏతావాన్। అస్య। మహిమా। అతః। జ్యాయాన్। చ। పురుషః। పాదః। అస్య। విశ్వా। భూతాని। త్రిఽపాత్। అస్య। అమృతమ్। దివి॥

సా॥ భా॥ అతీతానాగతవర్తమానరూపం జగద్యావదస్తి ఏతావాన్-సర్వోఽపి, అస్య-పురుషస్య, మహిమా-స్వకీయసామర్థ్య విశేషః నతుతస్య వాస్తవస్వరూపం। వాస్తవస్వరూపస్తు పురుషః అతః-మహిమ్నోఽపి, జ్యాయాన్ - అతిశయేన అధికః, ఏతచ్చోభయం స్పష్టీక్రియతే। అస్య-పురుషస్య విశ్వా-సర్వాణి, భూతాని-కాలత్రయవర్తీని ప్రాణిజాతాని, పాదః = చతుర్థోంఽశః। అస్య-పురుషస్య అవశిష్టం, త్రిపాత్-త్రిస్వరూపం అమృతం-వినాశరహితం సత్, దివి-ద్యోతనాత్మకే స్వప్రకాశస్వరూపే వ్యవతిష్ఠత ఇతి। యద్యపి = సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" (తై.ఉ.2-1) ఇత్యామ్నాతస్య పరబ్రహ్మణః ఇయత్తాభావాత్ పాదచతుష్టయం నిరూపయితుమశక్యం తథాపి జగ. దిదం బ్రహ్మస్వరూపాపేక్షయాల్పమితివివక్షితత్వాత్పాదత్వోపన్యాసః।

సా॥భా॥అను॥ భూతభవిష్యద్వర్తమానరూపమగు జగత్తు ఏది కలదో, ఏతావాన్ = అది అంతయును, అస్య = విరాట్పురుషునియొక్క, మహిమా=సామర్థ్య విశేషము, కానీ వాస్తవస్వరూపముకాదు. వాస్తవ స్వరూపము అయితే పురుషః = పరమపురుషుడు, అతః = మహిమా విశేషముకంటే, జ్యాయాన్=చాలా అధికుడు, ఈరెండు విషయములు స్పష్టము చేయబడుచున్నవి. అస్య = విరాట్పురుషునికి, విశ్వా-భూతాని = మూడుకాలములలో నుండు సకల ప్రాణికోటి, పాదః = నాల్గవభాగము, అస్య=ఈ విరాట్పురుషునియొక్కమిగిలిన, త్రిపాత్= మూడుభాగముల స్వరూపము, అమృతం = వినాశరహితమై, దివి = స్వప్రకాశస్వరూపమగు స్వర్గమునందుండెను. "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" (తై.ఉ. 2-1) అని ఉపనిషత్తు పరబ్రహ్మ స్వరూపమును పేర్కొనుటవలన నాలుగుపాదములునిరూపించుట అశక్యముఅయిననూ ఈ జగత్తు బ్రహ్మస్వరూపమునకంటె అల్పము అని వివరించుటకు పాదము అని పేర్కొనబడినది.

వ్యా॥ వి॥ ఏతావాన్ = ఋగ్వేదములోని ఇంతకు ముందు సూక్తములలో ఒకపదములోని అఖరు(న్)అను వర్ణముతో ప్రారంభించ బడినదై అచ్చుచేత అనుసరించబడినదై (న్) అనుదానికి లోపమేర్పడి పూర్వముగల అచ్చు అనునాసికం అయ్యెను. కానీ తరువాత గల సూక్తములలో ఈ పద్ధతి సక్రమముగలేదు. ఏతావానస్య = వేద-కాలము తరువాత ఏర్పడిన సంధి ఈ సూక్తము ఆలస్యముగా ఏర్పడినదని సూచించుచున్నది. పూరుషః = మొదటి అక్షరమునకు దీర్ఘము వచ్చెను.

సం॥పా॥ 4) త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః
పాదోఽస్యేహాభవత్పునః।

తతో విష్వఙ్వ్యక్రామత్
సాశనానశనే అభి॥

ప॥ పా॥ త్రి౭పాత్। ఊర్ధ్వః। ఉత్। ఐత్। పురుషః। పాదః। అస్య। ఇహ। అభవత్। పునరితి। తతః। విష్వఙ్। వి। అక్రామత్। సాశనా నశనే ఇతి। అభి॥

సా॥ భా॥ యో౭యం త్రిపాత్పురుషః-సంసారరహితో బ్రహ్మస్వరూపః సో౭యం, ఊర్ధ్వం ఉదైత్-అస్మాదజ్ఞానకార్యాత్ సంసారాత్ బహిర్భూతో౽త్రత్యైర్గుణదోషైరస్పృష్టః ఉత్కర్షేణస్థితవాన్। తస్యాస్య-సో౭యం, పాదః-లేశఃసోయం, ఇహ-మాయాయాం, పునః అభవత్-సృష్టిసంహారాభ్యాం పునఃపునఃఆగచ్ఛతి।తతః-మాయాయామాగత్యా-నంతరం, విష్వఙ్ - దేవమనుష్య తిర్యగాదిరూపేణ వివిధస్సన్, వ్యక్రామత్-వ్యాప్తవాన్। కింకృత్వాసాశనానశనే-అభిలక్ష్య। సాశనం-భోజనాదివ్యవహారోపేతంచేతనం ప్రాణిజాతమ్, అనశనం-తద్రహితమ-చేతనం గిరినద్యాదికమ్ తదుభయం యథాస్యాత్తథా స్వయమేవ వివిధోభూత్వా వ్యాప్తవానిత్యర్థః।

సా॥ భా॥ అను॥ త్రిపాత్ పురుషః = సంసారరహితుడు బ్రహ్మ-స్వరూపుడు అగు విరాట్పురుషుడు, ఊర్ధ్వం ఉదైత్ = అజ్ఞానరూప-మగు సంసారమునకంటెబహిర్భూతుడై ఇచ్చట ఉన్న గుణదోషముల చేత స్పృశించబడకుండా, గొప్పగా ఉండెను. అస్యపాదః = అయన యొక్క ఈనాల్గవపాదము, ఇహ = మాయయందు, పునః అభవత్ = సృష్టిసంహారములద్వారా మరల మరల ప్రవర్తించుచున్నది. తతః = మాయయందు ప్రవర్తించిన తరువాత, విష్వఙ్ = దేవమనుష్య పశుపక్ష్యాదుల రూపమగు బహువిధముల, వ్యక్రామత్ = వ్యాపించెను.

సాశనానశనే, సాశనం = భోజనాది వ్యవహారములతోకూడిన ప్రాణి-కోటిని, అనశనం = ఆహారవ్యవహారములు లేని అచేతనముగు నదీ పర్వతములను, ఈ రెండింటినీ సృష్టించుటకు స్వయముగా విరాట్-పురుషుడు బహువిధములుగా వ్యాప్తిచెందెనని అర్థము.

వ్యా॥ వి॥ ఉదైత్-ఉత్ అను ఉపసర్గపూర్వకముగా ఇణ్ గతౌ అనుధాతువునకు లఙ్ ప్రథమ పురుషైకవచనము. పునః = చివరి విసర్గలు రేఫమును పొందినవి, అందువలన పదపాఠములో ఇతి అనునది ఏర్పడెను. (పునరితి) తతః = మాయయందు ప్రవర్తించిన తరువాత అని సాయణులు, అప్పటినుండి అని Griffith, Macdonell అర్థమును వివరించిరి. విష్వఙ్ = దేవమనుష్య పశుపక్ష్యాదులరూప-ముగా అని సాయణులు అన్నివైపుల అని Peterson, Griffith అన్ని దిక్కులయందు అని Macdonell అర్థములు వివరించిరి. వ్యక్రామత్= వి అను ఉపసర్గపూర్వకముగా క్రముపాదవిక్షేపే అనుధాతువునకు లఙ్ ప్రథమపురుషైకవచనము. సాశనానశనే ఇతి = ఆహారమును గ్రహించెడి ప్రాణికోటిని, ఆహారమును గ్రహించని నదీపర్వతాదికమును, ఈ సమాసము ఋగ్వేదమునందు తరువాత ధశలో ఏర్పడిన ద్వంద్వ సమాసములనుతెలియచేయుచున్నది. కానీపదపాఠమునందుద్వంద్వ సమాసములు విభజింపబడలేదు. ఆఖరి ఏకారము ప్రగృహ్యము, అందువలన పదపాఠములో ఇతి అనుదానితో పఠించబడెను.

స్వ॥ వి॥ సాశనానశనే ఇతి – ఇచ్చట పూర్వపదము ఉదాత్త-మును పొందలేదు. ఉత్తరపదములోని చివరి అక్షరము ఉదాత్త-మును పొందెను.

సం॥పా॥ 5) తస్మాద్విరాళజాయత విరాజో
అధిపూరుషః।
సజాతో అత్యరిచ్యత
పశ్చాద్భూమిమథోపురః॥

ప॥ పా॥ తస్మాత్। వి౽రాట్। అజాయత। వి౽రాజః। అధి।
పురుషః। సః। జాతః। అతి। అరిచ్యత। పశ్చాత్।
భూమిమ్। అథో ఇతి। పురః॥

సా॥భా॥ విష్వఙ్ వ్యక్రామదితి యదుక్తం తదేవాత్ర ప్రపంచ్యతే। తస్మాత్-ఆదిపురుషాత్ విరాట్ - బ్రహ్మాండదేహః, అజాయత-ఉత్పన్నః। వివిధాని రాజన్తే వస్తూని అత్రేతివిరాట్। విరాజో౽ధి-విరాట్‌దేహస్యోపరి తమేవదేహమధికరణం కృత్వా, పురుషః-తద్దేహాభిమానీకశ్చిత్పుమాన్ అజాయత। సో౽యం సర్వవేదాన్తవేద్యః - పరమాత్మా స్వయమేవస్వకీయయా మాయయా విరాట్‌దేహం బ్రహ్మాండరూపం సృష్ట్వా తత్ర జీవరూపేణ ప్రవిశ్య బ్రహ్మాండాభిమానీ దేవతాత్మాజీవో౽భవత్। సజాతః-విరాట్‌పురుషః, అత్యరిచ్యత-అతిరిక్తో౽భూత్। విరాట్ వ్యతిరిక్తో దేవతిర్యఙ్ మనుష్యాదిరూపో౽భూత్। పశ్చాత్ దేవాదిజీవ భావాదూర్ధ్వం, భూమిమ్-ససర్జేతిశేషః। అథో-భూమిసృష్టేరనంతరం తేషాం జీవానాం, పురః = ససర్జ। పూర్యం తే సప్తభిర్ధాతుభిరితి పురః శరీరాణి॥

సా॥భా॥అను॥ "విష్వఙ్‌వ్యక్రామత్" అనిఏదైతే చెప్పబడినదో ఆ విషయమే ఇచ్చట వివరింపబడుచున్నది. తస్మాత్ = ఆదిపురుషుని నుండి, విరాట్ = బ్రహ్మాండదేహము, అజాయత = ఉత్పన్నమైనది. విరాజో౽ధి = విరాట్‌దేహమునకుపైన ఆ దేహమునే ఆధారముగా

చేసుకొని, పురుషః = ఆ దేహముపైన అభిమానముగల ఒక పురుషుడు జన్మించెను. ఆయన అన్ని వేదాన్తములచేత తెలుసుకొనదగిన పరమాత్మ స్వయముగనే తన మాయచేత విరాట్‌దేహము బ్రహ్మాండరూపమును సృజించి అచ్చట జీవరూపుడుగా ప్రవేశించి బ్రహ్మాండమునకు అభిమాని దేవతలకు ఆత్మజీవుడయ్యెను. సజాతః= ఆ విరాట్‌పురుషుడు, అత్యరిచ్యత = అతిరిక్తుడుగా ఉండెను. (విరాట్ కంటే వేరుగా) దేవతిర్యజ్ = (పశుపక్ష్యాదులు) మనుష్యరూపముగా ఉండెను. పశ్చాత్=దేవాది జీవభావము పొందిన తరువాత, భూమిం= భూమిని సృష్టించెను. అధో = భూమి సృష్టి అనంతరము ఆ జీవులకు పురః = శరీరములను సృష్టించెను. ఏడు దాతువులచేత పూరింపబడుచున్నవి కావున పురః అని ఏర్పడినది. (పురః = శరీరము)

వ్యా॥ వి॥ అజాయత = జనీ ప్రాదుర్భావే అను ఆత్మనే పద ధాతువునకు లఙ్ ప్రథమపురుషైకవచనము. అరిచ్యత=వదలిపెట్టుట అను అర్థముగల రిచదాతువునకు కర్మణి ప్రయోగము లఙ్ ప్రథమ పురుషైకవచనము. అధో (అధ + ఉ) చివరిఓకారము ప్రగృహ్యము. పురః = శరీరము (సాయణ) ముందుగ (Peterson, Macdonell) తూర్పుపైపు (Griffith) అనుఅర్థములను ఆయా పాశ్చాత్యపండితులు వివరించిరి. “సజాతో........అదోపురః” ఈ వాక్యము పలువిధములుగ వ్యాఖ్యానము చేయబడినది. ఆ విరాట్‌పురుషుడు అతిరిక్తముగ నుండెను. విరాట్‌కంటె వేరుగా దేవతిర్యజ్ మనుష్యరూపముగా ఉండెను. తరువాత భూమిని, శరీరములను సృష్టించెను. [Sayana] విరాట్‌పురుషుడుద్భవించి భూమిని కొంతదూరము విశాలము చేసెను. ముందు వెనుక (Peterson, Macdonell) విరాట్పురుషుడుద్భవించి భూమికి తూర్పుపడమరలపైపు వ్యాపించెను. (Griffith )

సం॥పా॥ 6) యత్పురుషేణ హవిషా
దేవాయజ్ఞమతన్వత।
వసన్తో అస్యాసీదాజ్యం
గ్రీష్మ ఇధ్మః శరద్ధవిః॥

ప॥పా॥ యత్। పురుషేణ। హవిషా। దేవాః। యజ్ఞమ్। అత-న్వత। వసన్తః। అస్య। ఆసీత్। ఆజ్యమ్। గ్రీష్మః। ఇధ్మః। శరత్। హవిః॥

సా॥భా॥ యత్-యదాపూర్వోక్త క్రమేణైవ శరీరేషూత్పన్నేషు సత్సు, దేవాః ఉత్తరసృష్టి సిద్ధ్యర్థం బాహ్యద్రవ్యస్యానుత్పన్నత్వేన హవిరంతరాసంభవాత్ పురుషస్వరూపమేవమనసాహవిష్ట్వేనసంకల్ప్య పురుషేణ-పురుషాఖ్యేన, హవిషా-మానసం యజ్ఞమతన్వత-అన్వతిష్ఠన్। తదానీం అస్య - యజ్ఞస్య, వసన్తః-వసంతర్తురేవ, ఆజ్యమాసీత్-అభూత్, తమేవాజ్యత్వేనసంకల్పితవన్త ఇత్యర్థః। ఏవం గ్రీష్మ ఇధ్మః ఆసీత్-తమేవేధ్మత్వేన సంకల్పితవన్త ఇత్యర్థః। తథాశరద్ధవిః ఆసీత్-తామేవపురోడాశాదిహవిష్ట్వేన సంకల్పితవంత ఇత్యర్థః।

సా॥ భా॥ అను॥ యత్ = పూర్వోక్త ప్రకారము శరీరములు ఉత్పన్నములుకాగా, దేవాః = ఉత్తరసృష్టికొరకు బాహ్యద్రవ్యము లనుత్పన్నములగుటవలన, హవిస్సులు లేకపోవుటవలన పురుష స్వరూపమునే మనస్సుచేత హవిస్సులుగా సంకల్పించుకొని, పురుషేణ హవిషా = పురుషుడను హవిస్సుచేత, యజ్ఞం అతన్వత = మానసిక యజ్ఞమును చేసిరి. అప్పుడు అస్య = ఈ యజ్ఞమునకు, వసంతః = వసంతఋతువు, ఆజ్యమాసీత్ = ఆజ్యముగా ఉండెను. (వసంత ఋతువును అజ్యముగా సంకల్పించుకొనిరి) గ్రీష్మఇధ్మః ఆసీత్ =

గ్రీష్మఋతువును ఇధ్మముగా (కట్టెలుగా) సంకల్పించుకొనిరి. అగ్ని శరద్ధవిః ఆసీత్ = శరదృతువును పురోడాశము మొదలగు హవిస్సు-లుగా (నైవేద్య ద్రవ్యములుగా) సంకల్పించుకొనిరి.

వ్యా॥ వి॥ అతన్వత = తను విస్తారే అను ఆత్మనే పదధాతువు-నకు లఙ్ ప్రథమ పురుషబహువచనము. ఆసీత్ = అసభువి అను ధాతువునకు లఙ్ ప్రథమపురుషైకవచనము.

స్వ॥వి॥ అతన్వత-యచ్ఛబ్దముతో వాక్యము ప్రారంభించ-బడెను గనుక ఉదాత్తము ఏర్పడెను.

సం॥పా॥ 7) తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్
పురుషం జాతమగ్రతః।
తేనదేవా అయజన్త
సాధ్యాఋషయశ్చయే॥

ప॥ పా॥ తం। యజ్ఞం। బర్హిషి। ప్ర। ఔక్షన్। పురుషమ్। జాతమ్। అగ్రతః। తేన। దేవాః।అయజన్త। సాధ్యాః। ఋషయః। చ। యే॥

సా॥భా॥ యజ్ఞం - యజ్ఞసాధనభూతం, తం-పురుషం పశుత్వ భావనయాయూపేబద్ధం, బర్హిషి-మానసేయజ్ఞే ప్రౌక్షన్- ప్రోక్షితవన్తః। కీదృశం అగ్రతః-సర్వసృష్టేః పూర్వం, పురుషం జాతం-పురుషత్వేనో త్పన్నమ్। తేన - పురుషరూపేణపశునా, దేవా అయజన్త - మానస యాగం నిష్పాదితవన్త ఇత్యర్థః। కేతే దేవా ఇత్యత్రాహ। సాధ్యాః-సృష్టి సాధనయోగ్యాః ప్రజాపతి ప్రభృతయః తదనుకూలాః, ఋషయః - మంత్రద్రష్టారః, యేచసన్తితే సర్వేఽప్యయజంతే-త్యర్థః॥

సా॥ బా॥ అను॥ యజ్ఞం = యజ్ఞమునకు సాధనభూతుడగు, తం = ఆ పురుషుని పశువను భావనచేత యూపమునందు (స్తంభము) బంధించిన వానిని, బర్హిషి = మానసికయజ్ఞమునందు, ప్రౌక్షన్ = పూర్వాది గడ్డిపరకలచేత ప్రోక్షించిరి. ఎటువంటి వానిని: అగ్రతః = మొత్తము సృష్టికిపూర్వము, పురుషంజాతం = పురుషుడుగా ఉత్పన్న మైనవాడు, తేన = అటువంటి పురుషరూపుడగు పశువుచేత, దేవా అయజన్త = మానసిక యాగమును చేసిరి. ఆ దేవతలు ఎవరనగా, సాధ్యాః = ప్రజాపతి మొదలగు సృష్టికర్తలు, ఋషయః = మంత్ర ద్రష్టలగు ఋషులు, యేచసన్తి = ఎవరైతే కలరో వారంతా యాగమును చేసిరి.

వ్యా॥ వి॥ యజ్ఞం-దానార్థక యజధాతువునుండి నిష్పన్న-మైన సుబంతరూపమునకు ద్వితీయైకవచనము. అయజన్త = ఆత్మనే పద యజధాతువునకు లఙ్ ప్రథమపురుషబహువచనము. సాధ్యాః = ప్రాచీనమగు యాగసంబంధ దేవతలు (యాగమునకు సంబంధించిన ఒక వర్గమువారు) అని Griffith ప్రజాపతి మొదలగు దేవతలు సృష్టి చేయుగల సమర్థులు అని సాయణులు, దేవతలకు సంబంధించిన నామములు అని Macdonell అభిప్రాయములను తెలిపిరి.

సం॥పా॥ 8) తస్మాద్యజ్ఞాత్సర్వహుతః
సంభృతం పృషదాజ్యమ్।
పశూన్తాంశ్చక్రే వాయవ్యా
నారణ్యాన్గ్రామ్యాశ్చ యే॥

ప॥ పా॥ తస్మాత్। యజ్ఞాత్। సర్వఽహుతః। సమ్ఽభృతమ్।

పృషత్ఽఆజ్యమ్। పశూన్। తాన్। చక్రే। వాయ-
వ్యాన్। అరణ్యాన్। గ్రామ్యాః। చ। యే॥

సా॥ భా॥ సర్వహుతః-సర్వాత్మకః పురుషః యస్మిన్ యజ్ఞే-
హూయతే సోఽయం సర్వహుత్] తాదృశాత్ తస్మాత్ - పూర్వోక్తాత్ మానసాత్యజ్ఞాత్, పృషదాజ్యం - దధిమిశ్రమాజ్యం, సంభృతమ్-
సంపాదితమ్॥ దధిచాజ్యం చేత్యేవమాది భోగ్యజాతం సర్వంసంపాదిత మిత్యర్థః। తథావాయవ్యాన్-వాయుదేవతాకాల్లోకప్రసిద్ధాన్, అరణ్యాన్ పశూన్ చక్రే-ఉత్పాదితవాన్, అరణ్యాహరిణాదయః। తథాయే చ గ్రామ్యాః-గవాశ్వాదయః తానపిచక్రే॥

సా॥ భా॥ అను॥ సర్వహుతః = సర్వాత్మకుడగు పురుషుడు ఏ యజ్ఞమునందు హవనము చేయబడుచున్నాడో ఆ యజ్ఞము సర్వహుత్ అనబడును. తస్మాద్యజ్ఞాత్ = పూర్వోక్తమగు మానసికయజ్ఞము నుండి, పృషదాజ్యం = దధిమిశ్రితమైన ఆజ్యము, (నెయ్యి) సంభృతం = సంపాదించబడినది, దధి ఆజ్యము మొదలగు భుజించబడు పదార్థములు పొందబడినవి. అట్లే వాయవ్యాన్ = వాయు దేవతలకు సంబంధించిన లోకములను అరణ్యాన్ పశూన్చక్రే = లేడి మొదలగు అరణ్యజంతువులను ఆ పురుషుడు సృష్టించెను. అట్లే యేచగ్రామ్యాః= గోవు అశ్వము మొదలగు గ్రామ్య జంతువులను సృష్టించెను.

వ్యా॥ సర్వహుతః = సర్వాత్మకుడగు పురుషుడు ఏ యజ్ఞము నందు హవనముచేయబడుచున్నాడో అది సర్వహుత్ అని సాయణులు పూర్ణముగా చేయబడినది అని Peterson గొప్ప అని Griffith పూర్తిగా సమర్పించుట అని Macdonell అర్థములను వివరించిరి. సంభృతమ్= సమ్ అను ఉపసర్గపూర్వకముగా క్త ప్రత్యయసహితముగా నున్న

భృధాతువుయొక్క భూతకాలికరూపము (సంపాదించబడినది, సేక-రించబడినది అని అర్థము.) అది ఇచ్చట Finite Verb. (హద్దుగల క్రియ)గా ఉపయోగించబడినది. పృషత్ఽఆజ్యమ్ = దధితో మిశ్రిత మగు నెయ్యి అని సాయణులు, వెన్న మరియూ దధిమిశ్రమమని Wilson బిందువులుగా పడు కొవ్వుపదార్థము అని Griffith గడ్డకట్టిన వెన్న అని Macdonell పలు అర్థములను వివరించిరి. వాయవ్యాన్ = పాదము చివరలో కలదు. కావున చివరి నకారమునకు లోపము రాలేదు.

స్వ॥ వి॥ పృషత్ఽఆజ్యమ్ = ఇది కర్మధారయసమాసము కాన ఉత్తరపదములోని చివరి అక్షరమునకు ఉదాత్తము వచ్చెను.

సం॥పా॥ 9) తస్మాద్యజ్ఞాత్సర్వహుత
ఋచః సామానిజజ్ఞిరే।
ఛన్దాంసిజజ్ఞిరే తస్మా
ద్యజుస్తస్మాదజాయత॥

ప॥ పా॥ తస్మాత్। యజ్ఞాత్। సర్వఽహుతః। ఋచః। సామాని। జజ్ఞిరే। ఛందాంసి। జజ్ఞిరే। తస్మాత్। యజుః।తస్మాత్। అజాయత॥

సా॥ భా॥ సర్వహుతః తస్మాత్ పూర్వోక్తాత్, యజ్ఞాత్ - ఋచః సామానిచజజ్ఞిరే-ఉత్పన్నాః।తస్మాత్-యజ్ఞాత్, ఛందాంసి-గాయత్ర్యా దీని, జజ్ఞిరే। తస్మాత్-యజ్ఞాత్, యజుః అపి అజాయత॥

సా॥భా॥అను॥ సర్వహుతః తస్మాత్యజ్ఞాత్=పూర్వోక్తమగు ఆయజ్ఞము నుండి ఋచః సామానిచజజ్ఞిరే - ఋక్కులు సామములు ఉత్పన్నము లైనవి. తస్మాత్=ఆ యజ్ఞమునుండి, ఛందాంసి=గాయత్రి మొదలగు

ఛందస్సులు, జజ్ఞిరే = ఉత్పన్నమైనవి. తస్మాత్=ఆ యజ్ఞమునుండి యజురస్మాదజాయత = యాజుస్సులుకూడా ఉద్భవించినవి.

వ్యా॥ వి॥ జజ్ఞిరే = జనీ ప్రాదుర్భావే అను ఆత్మనేపదధాతువునకు లిట్ ప్రథమ పురుషబహువచనము. ఛందాంసి = గాయత్రి మొదలగు ఛందస్సులు అని సాయణులు, అధర్వవేదము అను అర్థమును Muir పండితుడు వివరించెను. ఈ అభిప్రాయమునే Peterson కూడా సమర్థించెను.

సం॥పా॥ 10) తస్మాదశ్వా అజాయన్త
యే కేచో భయాదతః।
గావోహ జజ్ఞిరే తస్మా
త్తస్మాజ్జాతా అజావయః॥

ప॥ పా॥ తస్మాత్। అశ్వాః। అజాయన్త। యే। కే। చ। ఉభయాదతః। గావః। హ। జజ్ఞిరే। తస్మాత్। తస్మాత్। జాతాః। అజావయః॥

సా॥ భా॥ తస్మాత్ - పూర్వోక్తాద్యజ్ఞాత్, అశ్వా అజాయన్త-ఉత్పన్నాః। తథా యే కేచ - అశ్వవ్యతిరిక్తాగర్దభా అశ్వతరాశ్చ, ఉభయాదతః-ఊర్ధ్వాధోభాగయోరుభయోః దన్తయుక్తాః సన్తి తేఽప్యజాయంత। తథా తస్మాత్-యజ్ఞాత్, గావః చ జజ్ఞిరే। కించ తస్మాత్-యజ్ఞాత్, అజావయః చ జాతాః॥

సా॥భా॥అను॥ తస్మాత్ = పూర్వోక్తమగు ఆ యజ్ఞమునుండి, అశ్వా అజాయన్త = గుఱ్ఱములు ఉత్పన్నమైనవి. అట్లే యే కేచ = అశ్వమునకంటె వేరైన గర్దభములు, ఉభయాదతః = ఊర్ధ్వాధోభాగములందు (పైన క్రింద) దంతములతోకూడినజంతువులు ఉత్పన్న

మైనవి. అస్మాత్ తస్మాత్ = ఆ యజ్ఞమునుండి, గావః చజజ్ఞిరే = గోవులు జనించినవి. ఇంకనూ ఆ యజ్ఞమునుండి, అజావయశ్చ జాతాః = మేకలు, గొర్రెలుకూడా పుట్టినవి.

వ్యా॥వి॥ ఉభయాదతః=రెండు వరుసల దంతములుకల్గినవి. అజావయః = అనగా గొర్రెలు మరియూ మేకలు ద్వంద్వసమాసము పదపాఠములో విభాగము చేయబడలేదు.

స్వ॥ వి॥ ఉభయాదతః = ఇది బహువ్రీహిసమాసము కావున పూర్వపదమునకు ఉదాత్తము వచ్చెను.

సం॥పా॥ 11) యత్పురుషం వ్యదధుః
కతిధావ్యకల్పయన్।
ముఖం కిమస్య కౌబాహూ
కాఊరూపాదా ఉచ్యేతే॥

ప॥పా॥ యత్। పురుషమ్। వి। అదధుః। కతిధా। వి। అకల్పయన్। ముఖమ్। కిమ్। అస్య। కౌ। బాహూ। ఇతి। కౌ। ఊరూ ఇతి। పాదౌ ఉచ్యేతే ఇతి॥

సా॥భా॥ ప్రశ్నోత్తరరూపేణ బ్రాహ్మణాది సృష్టింవక్తుం బ్రహ్మవాది నాంప్రశ్నా ఉచ్యన్తే। ప్రజాపతేః ప్రాణరూపాదేవాః యత్-యదా, పురుషం-విరాడ్రూపం। వ్యదధుః - సంకల్పేనోత్పాదితవన్తః తదానీం కతిధా-కతిభిః ప్రకారైః, వ్యకల్పయన్ - వివిధం కల్పితవంతః। అస్య - పురుషస్య, ముఖం కిం ఆసీత్, కౌబాహూ అభూతామ్, కా ఊరూ, కౌచపాదా వుచ్యేతే, ప్రథమంసామాన్యరూపః ప్రశ్నః పశ్చాత్ముఖంకిమిత్యాది నావిశేష విషయాః ప్రశ్నాః॥

సా॥భా॥అను॥ ప్రశ్నోత్తరరూపముగా బ్రాహ్మణాదులసృష్టిని

వివరించుటకు బ్రహ్మవాదుల ప్రశ్నలు పేర్కొనబడుచున్నవి. ప్రజా-పతికి (బ్రహ్మకు) ప్రాణరూపులగు దేవతలు, యత్ = ఎప్పుడు, పురుషం = విరాట్పురుషుని, వ్యదధుః = సంకల్పముద్వారా ఉత్పాదనచేసిరో అప్పుడు, కతిధా = ఎన్ని విధములుగా, వ్యకల్పయన్ = కల్పనచేసిరి. (విభాగము చేసిరి) అస్య = విరాట్పురుషునికి, ముఖం కిమ్ = ముఖము ఏమై ఉండెను? కౌ బాహూ = భుజములు ఏమని వ్యవహరించబడినవి. కా ఊరూ = ఊరువులు (తొడలు) ఏమని పిలువ-బడినవి. కౌ చపాదావుచ్యేతే = పాదములేవిధముగా వ్యవహరించ-బడినవి. మొదట సామాన్యరూపమగు ప్రశ్నలు తరువాత విశేష విషయి ప్రశ్నలు వేయబడినవి.

వ్యా॥ వి॥ వ్యదధుః = వి అను ఉపసర్గపూర్వకముగా ధార-ణార్థకధాధాతువునకు లఙ్ ప్రథమపురుషబహువచనము, అకల్పయన్ = కల్పించుట అను అర్థముగల క్లృప్ ధాతువునకు లఙ్ ప్రథమపురుషబహు వచనము. ఉచ్యేతే = వచపరిభాషణే అను ఆత్మనేపద ధాతువునకు లట్ ప్రథమ పురుషద్వివచనము. ద్వివచనములోని చివరి ఏకారము ప్రగృహ్యసంజ్ఞను పొందెను. అందువలన పదపాఠములో ఇతి అను-నది ఏర్పడెను. (ఉచ్యేతే ఇతి)

స్వ॥ వి॥ వ్యదధుః = యచ్ఛబ్దముతో వాక్య ప్రారంభము గనుక ఈ పదమునకు ఉదాత్తము వచ్చెను. (అదధుః)

సం॥పా॥ 12) బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్
బాహూ రాజన్యః కృతః।
ఊరూ తదస్య యద్వైశ్యః
పద్భ్యాం శూద్రో అజాయత॥

ప॥ పా॥ బ్రాహ్మణః। అస్య। ముఖమ్। ఆసీత్। బాహూ ఇతి। రాజన్యః। కృతః। ఊరూ ఇతి। తత్। అస్య। యత్। వైశ్యః। పత్‌ఽభ్యామ్। శూద్రః। అజాయత॥

సా॥ భా॥ ఇదానీం పూర్వోక్తానాం ప్రశ్నానాముత్తరాణి దర్శయతి। అస్య-ప్రజాపతేః, బ్రాహ్మణః - బ్రాహ్మణత్వ జాతి విశిష్టః పురుషః, ముఖమాసీత్-ముఖాదుత్పన్న ఇత్యర్థః। యోఽయంరాజన్యః క్షత్రియత్వ జాతిమాన్ పురుషః సః, బాహూకృతః-బాహుత్వేననిష్పాదితః, బాహుభ్యాముత్పాదిత ఇత్యర్థః। తత్-తదానీమ్, అస్య-ప్రజాపతేః, యత్-యౌ ఊరూతద్రూపః వైశ్యః సంపన్నః ఊరుభ్యాముత్పన్న ఇత్యర్థః। తథాస్యపద్భ్యాం-పాదాభ్యాం,శూద్రః-శూద్రత్వ జాతిమాన్ పురుషః అజాయత॥

సా॥భా॥అను॥ పూర్వోక్త ప్రశ్నలకు సమాధానములు ప్రదర్శింపబడుచున్నవి. అస్య=ఈ ప్రజాపతికి, బ్రాహ్మణః=బ్రాహ్మణత్వ జాతితోకూడిన పురుషుడు, ముఖమాసీత్ = ముఖమునుండి ఉత్పన్నమయ్యెను. రాజన్యః = క్షత్రియత్వజాతితోకూడిన పురుషుడు, బాహూ కృతః = బాహువులుగా ఉత్పాదన చేయబడెను. బాహువులనుండి ఉత్పన్నమయ్యెను అని అర్థము. తత్ = అప్పుడు అస్య=ప్రజాపతికి యత్ ఊరూ = ఏవైతే ఊరువులు కలవో ఆ రూపములో, వైశ్యః = వ్యాపారము చేయు వైశ్యుడు ఉత్పన్నమయ్యెను. ఊరువులనుండి ఉత్పన్నమయ్యెనని అర్థము. అట్లే ప్రజాపతియొక్క పద్భ్యాం = పాదములనుండి, శూద్రః = శూద్రత్వజాతి కలిగిన పురుషుడు, అజాయత = జనించెను. (ముఖము మొదలగు అవయవములనుండి బ్రాహ్మణాదుల ఉత్పత్తి యజుర్వేదసంహితయందు "సముఖతస్త్రి-

వృతం నిరమిమీత" (తై.సం, 7-1-14) అను మంత్రము ద్వారా స్పష్టముగా వివరించబడెను.

సం॥పా॥ 13) చన్ద్రమా మనసో జాతశ్చక్షోః
సూర్యో అజాయత।
ముఖాదిన్ద్రశ్చాగ్నిశ్చ
ప్రాణాద్వాయురజాయత॥

ప॥ పా॥ చంద్రమాః।మనసః। జాతః। చక్షోః। సూర్యః।అజా-
యత। ముఖాత్। ఇన్ద్రః। చ। అగ్నిః। చ। ప్రాణాత్।
వాయుః। అజాయత॥

సా॥ భా॥ యథాదధ్యాజ్యాది ద్రవ్యాణి గవాదయః పశవః ఋగాదివేదా బ్రాహ్మణాదయోమనుష్యాశ్చ తస్మాదుత్పన్నా ఏవం చంద్రాదయో దేవా అపితస్మాదేవోత్పన్నా ఇత్యాహ। ప్రజాపతేః మనసః-సకాశాత్. చంద్రమాః జాతః। చక్షోః చ చక్షుషః సూర్యః-అపి అజాయత। అస్యముఖాదిన్ద్రశ్చాగ్నిశ్చ - దేవావుత్పన్నౌ। అస్య ప్రాణాద్వాయురజాయత॥

సా॥ భా॥ అను॥ ఎట్లైతే దధ్యాజ్యాది ద్రవ్యములు, గో మొదలగు పశువులు, ఋగాది వేదములు, బ్రాహ్మణుడు మొదలగు మనుష్యులు ఉత్పన్నము అయినారో అట్లే చంద్రాది దేవతలుకూడా ఉత్పన్నమయిరి. ప్రజాపతియొక్క, మనసః = మనస్సునుండి, చంద్రమాః జాతః = చంద్రుడు జనించెను. చక్షోః=నేత్రములనుండి సూర్యః = సూర్యుడు, అజాయత = ఉద్భవించెను. ముఖాదింద్ర-శ్చాగ్నిశ్చ = ప్రజాపతి ముఖమునుండి ఇంద్రుడు మరియు అగ్ని ఉత్పన్నమైరి. ప్రాణాద్వాయురజాయత=అట్లే ప్రజాపతి ప్రాణము నుండి వాయువు జనించెను.

సం॥పా॥ 14) నాభ్యా ఆసీదన్తరిక్షం
శీర్ష్ణో ద్యౌః సమవర్తత।
పద్భ్యాం భూమిర్దిశః శ్రోత్రాత్
తథాలోకాగ్ం అకల్పయన్॥

ప॥ పా॥ నాభ్యాః। ఆసీత్। అన్తరిక్షమ్। శీర్ష్ణః। ద్యౌః। సమ్। అవర్తత। పత్ఽభ్యామ్। భూమిః। దిశః। శ్రోత్రాత్। తథా। లోకాన్। అకల్పయన్॥

సా॥ భా॥ యథాచంద్రాదీన్ ప్రజాపతేర్మనః ప్రభృతిభ్యోఽకల్పయన్ తథా - అంతరిక్షాదీన్, లోకాన్-ప్రజాపతేః నాభ్యాదిభ్యో, దేవాః, అకల్పయన్ - ఉత్పాదితవంతః। నాభ్యాః- ప్రజాపతేర్నాభేః అంతరిక్షమాసీత్। శీర్ష్ణః-శిరసః, ద్యౌః సమవర్తత - ఉత్పన్నా। అస్య పద్భ్యాం-పాదాభ్యాం, భూమిః - ఉత్పన్నా। అస్యశ్రోత్రాత్దిశః ఉత్పన్నాః॥

సా॥భా॥అను॥ ఎట్లైతే చంద్రాదులు ప్రజాపతియొక్క మనస్సు మొదలగు అవయవములనుండి ఉత్పాదన చేయబడిరో, తథా = అట్లే అంతరిక్షాది, లోకాన్ = లోకములను ప్రజాపతియొక్క నాభి మొదలగు ప్రదేశములనుండి దేవతలు, అకల్పయన్ = కల్పనచేసిరి. (ఉత్పా-దనచేసిరి) నాభ్యాః= ప్రజాపతియొక్క నాభినుండి, అంతరిక్షమాసీత్= అన్తరిక్షము (మధ్యలోకము) ఉత్పన్నమయ్యెను. శీర్ష్ణః = శిరస్సు నుండి, ద్యౌః సమవర్తత = ఆకాశముద్భవించెను. ప్రజాపతియొక్క పద్భ్యాం = పాదములనుండి, భూమిః = భూమి ఉత్పన్నమయ్యెను. ఈ ప్రజాపతియొక్క, శ్రోత్రాత్= శ్రోత్రములనుండి, దిశః = తూర్పు మొదలగు దిక్కులు ఉత్పన్నమైనవి.

వ్యా॥ వి॥ సమవర్తత = సమ్ అను ఉపసర్గపూర్వకముగా వృతువర్తనే అను ఆత్మనేపదధాతువునకు లఙ్ ప్రథమపురుషైకవచనము.

సం॥పా॥ 15) సప్తా స్యాసన్పరిధయస్త్రిః
సప్తసమిధః కృతాః।
దేవా యద్యజ్ఞం తన్వానా
అబధ్నన్పురుషం పశుమ్॥

ప॥ పా॥ సప్త। అస్య। ఆసన్। పరిఽధయః। త్రిః। సప్త। సమ్ఽఇధః। కృతాః। దేవాః। యత్। యజ్ఞమ్। తన్వానాః। అబధ్నన్। పురుషమ్। పశుమ్॥

సా॥ భా॥ అస్య-సాంకల్పికయజ్ఞస్య గాయత్ర్యాదీని, సప్తఛందాంసి, పరిధయః ఆసన్। ఐష్టికస్యాహవనీయస్యత్రయః పరిధయ ఉత్తరవేదికాస్త్రయః ఆదిత్యశ్చ సప్తమః పరిధి ప్రతినిధిరూపః। తతఏవ ఆదిత్యసహితాః సప్తపరిధయోఽత్ర సప్తఛందోరూపాః-తథాసమిధః త్రిఃసప్త - త్రిగుణీకృత సప్తసంఖ్యాకాః ఏకవింశతిః కృతాః। ద్వాదశమాసాః పంచర్తవస్త్రయ ఇమేలోకా అసావాదిత్య ఏకవింశః (తై.సం. 5-1-103) ఇతిశ్రుతాః పదార్థా ఏకవింశతిదారుయుక్తేధ్మత్వేన భావితాః। యత్-యః పురుషః వైరాజోఽస్తి తం,పురుషం దేవాః - ప్రజాపతి ప్రాణేంద్రియరూపాః యజ్ఞం తన్వానాః-మానసం యజ్ఞం తన్వానాః కుర్వాణాః, పశుం అబధ్నన్-విరాట్పురుషమేవ పశుత్వేన భావితవంతః॥

సా॥ భా॥ అను॥ అస్య = సాంకల్పికయజ్ఞమునకు గాయత్రి మొదలగు, సప్త = ఏడు ఛందస్సులు, పరిధయః ఆసన్ = ఐషికాహవ

నియమునకు మూడుపరిధులు, ఉత్తరవేదికలు మూడు, ఆదిత్యుడు ఏడవపరిధికి ప్రతినిధిరూపముగా ఉండెను. అందువలన ఆదిత్యుడితో కూడిన ఏడు పరిధులు ఇచ్చట ఏడు ఛందోరూపములుగా నున్నవి. అట్లే సమిధః త్రిః సప్త=(21) సమిధలు చేయబడినవి. అవి 12 మాసములు, 5 ఋతువులు, 3 లోకములు ఆదిత్యునితో కలిపి (21) సంఖ్య ఏర్పడును. (తై.సం. 5-1-10, 3) ఇట్లు శృతిలో పేర్కొన-బడిన పదార్థములు (21) దారువులతోకూడిన ఇధ్మములుగా భావించ-బడినవి. యత్=ఏ పురుషుడు విరాట్‌గా ఉన్నాడో, తం పురుషం దేవాః=ఆ పురుషుని ప్రజాపతికి ప్రాణేంద్రియరూపులగు దేవతలు, యజ్ఞంతన్వానాః=మానసిక యజ్ఞమును చేయుచూ, పశుంఅబధ్నన్= విరాట్‌పురుషునే పశువుగా భావించిరి.

వ్యా॥ వి॥ సప్త పరిధయః = గాయత్రి మొదలగు ఏడు ఛందస్సులే యజ్ఞమునకు పరిధులుగా ఉండెనని సాయణులు ఏడు సముద్రములే ఏడు పరిధులుగా ఉండెనని మహీధరుడు, ఏడు పరిధులలోగల ఏడు సంఖ్యను పవిత్రమైన దానినిగా Macdonell భావించెను. హోమకుండమునకు (మూడు) ఆకుపచ్చని పుల్లలు మాత్రమే చుట్టుపక్కల పరిధులుగా ఉపయోగించబడునని Macdonell అభిప్రాయము. కృతాః=కృధాతువునకు భూతకాలిక క్త ప్రత్యయరూపము, ఇచ్చట Finite Verb. (హద్దుగలక్రియ)గా ఉపయోగించబడినది. తన్వానాః=తనువిస్తారే అనుధాతువునుండి నిష్పన్నమైన వర్తమానకాలిక ప్రథమాబహువచన రూపము. అబధ్నన్ = బంధనార్ధక బధధాతువునకు లఙ్ ప్రథమపురుష బహు-వచనము.

స్వ॥ వి॥ అబధ్నన్ - అనునది పాద ప్రారంభము కనుక ఉదాత్తమును పొందెను.

సం॥పా॥ 16) యజ్ఞేన యజ్ఞమయజన్త దేవా
స్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్।
తేహనాకం మహిమానః సచన్త
యత్రపూర్వేసాధ్యాః సన్తిదేవాః॥

ప॥ పా॥ యజ్ఞేన। యజ్ఞమ్। అయజన్త। దేవాః।తాని।ధర్మాణి। ప్రథమాని। ఆసన్। తే। హ। నాకమ్। మహిమానః। సచన్త। యత్ర। పూర్వే। సాధ్యాః। సన్తి। దేవాః॥

సా॥ భా॥ పూర్వం ప్రపంచేనోక్తమర్థం సంక్షిప్యాత్రదర్శ-యతి, దేవాః-ప్రజాపతి ప్రాణరూపాః, యజ్ఞేన-యథోక్తేన మానసేన సంకల్పేన, యజ్ఞం-యథోక్త యజ్ఞస్వరూపం ప్రజాపతిం,అయజన్త-పూజితవన్తః। తస్మాత్పూజనాత్, తాని-ప్రసిద్ధాని ధర్మాణి-జగద్రూప-వికారాణాంధారకాణి, ప్రథమాని-ముఖ్యాని, ఆసన్। ఏతావతాసృష్టి ప్రతిపాదకసూక్తభాగార్థః సంగృహీతః। అథోపాసనతత్ఫలానువాదక భాగార్థః సంగృహ్యతే। యత్ర-యస్మిన్ విరాట్ ప్రాప్తిరూపేనాకే। పూర్వేసాధ్యాః-పురాతనా విరాడుపాస్తిసాధకాః, దేవాః సన్తి-తిష్ఠంతి, తత్నాకం-విరాట్ప్రాప్తిరూపం స్వర్గం, తే మహిమానః-తదుపాసకా మహాత్మానః, సచన్త-సమవయన్తి ప్రాప్నువన్తి॥

సా॥భా॥అను॥ పూర్వము వివరించిన అర్థమును సంక్షేపముగా ప్రదర్శించుచున్నాడు. దేవాః=ప్రజాపతి ప్రాణరూపులు, యజ్ఞేన = మానసికసంకల్పముద్వారా, యజ్ఞం=యజ్ఞస్వరూపుడగు ప్రజాపతిని, అయజన్త =పూజించిరి. ఆ పూజవలన, తాని = ప్రసిద్ధములు,

ధర్మాణి = జగద్రూప వికారములను ధరించునవి, ప్రధమాని ఆసీన్= ముఖ్యములుగా ఉండెను. ఇప్పటివరకు సృష్టిని ప్రతిపాదన చేయు సూక్తభాగార్థము సంగ్రహించబడెను. అనంతరము ఉపాసనా ఫలాన్ని అనువదించుభాగార్థముసంగ్రహించబడును. యత్ర=విరాట్ ప్రాప్తిరూపమగు ఏ స్వర్గమువందు, పూర్వేసాధ్యాః = ప్రాచీనులు విరాడుపాసనా సాధకులు, దేవాఃసన్తి = దేవతలున్నారో, తత్ నాకం = విరాట్ప్రాప్తిరూపమగు ఆ స్వర్గమును, తే మహిమానః = దానిని ఉపాసించు మహాత్ములు, సచన్త = పొందుచున్నారు.

వ్యా॥వి॥ సచన్త = వెంబడించిపోవు, పొందుట అను అర్థములు గల ఆత్మనేపద సచ ధాతువునకు లఙ్ ప్రధమపురుషబహువచనము.

—o—

## తప్పొప్పుల పట్టిక

| పేజీ నెం. | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 2-4 | యజ్ఞము | యజ్ఞము |
| 43-11 | తప్తా | తృప్తా |
| 59-9 | త్వీం | త్విం |
| 61-23 | స్కంధనేభిః | స్కంభనేభిః |
| 62-3 | యయే | మమే |
| 62-4 | స్కంధనేభిః | స్కంభనేభిః |
| 62-9 | రజసే, వియయే | రజసీ, విమమే |
| 62-12 | కర్మాచ్ఛయా | కర్మేచ్ఛయా |
| 62-13 | అజీర్ణైః | అజీర్ణైః |
| 63-3 | స్కందనేభిః | స్కంభనేభిః |
| 63-15 | క్షేత్రం | క్షత్రం |
| 63-18 | మోజే | మోజో |
| 63-20 | బృపత్ | బృహత్ |
| 64-3 | సర్వత్రె | సర్వత్ర |
| 64-17 | సమీన్వదం | సమిన్వతం |
| 64-18 | గృగానే | గృణానే |
| 66-11 | లోకా | లోక |
| 66-13 | నిర్మయు, యతి | నిర్మయే, మతి |
| 66-16 | ఖ్యాతం | ఖాశ్రితం |
| 67-2 | వోక | లోక |
| 69-10 | వీస్తీర్ణేషు | విస్తీర్ణేషు |
| 69-11 | ఆశ్రిత | ఆశ్రిత్య |

| | | |
|---|---|---|
| 71-14 | గిరిక్షితే | గిరిక్షిలే |
| 71-18 | వ్యాపికాయ | వ్యాపకాయ |
| 73-13 | ప్రక్షిపణాని | ప్రక్షేపణాని |
| 73-16 | విశ్వ | విశ్వా |
| 73.23 | అక్షీయమాగా | అక్షీయమాణా |
| 75-9 | పరయే | పరమే |
| 75-17 | దోతనస్యభావం | ద్యోతనస్వభావం |
| 75-15 | సేవ్యత్వేన | సేవ్యత్వేన |
| 83.17 | శ్వశ్రూవం, కిత్వం | శ్వశ్రూం, కితవం |
| 87-5 | ఆదిధ్య | ఆదిధ్యే |
| 93-17 | నీచాన | నీచీన |
| 93-22 | ఆపి | అపి |
| 96-19 | వ్యాపకానయుయుక్షాన్జే, వ్యాపకానక్షాన్యుయుజే | |
| 101-14 | నుతా | ను |
| 103-4 | వృత్వాత్మ్యా | వృత్వాత్య |
| 103-9 | దేవిహోరాడాఖ్యో | దేహోవిరాడాఖ్యో |

# BIO - DATA



పేరు :

డా॥ కె. హయగ్రీవశర్మ

విద్యార్హతలు :

M.A., M Phil., Ph.D.,
Sahitya Siromani

వృత్తి :

రీడర్, సంస్కృతవిభాగము.
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి.

రచనలు :

The Grammatical Foundations of Alankaras [M.Phil.,]

Vāmana and the Pañcamahakavyas (Ph.D.,)

ప్రచురణలు :

1) నిరుక్తమునకు తెలుగు వివరణ
(1వఅధ్యాయము 2వఅధ్యాయమునకు మొదటిపాదము)

2) ఋగ్వేదసూక్తములు : శ్రీసాయణభాష్యమునకు తెలుగు అనువాదము (వ్యాకరణ స్వరవిశేషములతో)

అభిరుచులు : గ్రంథపఠనము, రచనలయందాసక్తి.